# బంగారు నడచిన బాట

(పిల్లల నవల)

కలువకొలను సదానంద

ప్రకాశకులు :
పద్మశ్రీ అండ్ కో., చిత్తూరు.

(11)

# తొలి మాట

పిల్లలకోసం ఓ కథ వ్రాస్తున్నానని చెప్పాడు సదానంద. బద్ధకిస్తే ఎంతకాలమైనా ఊరుకుండి పోవడం, వ్రాయ దలచుకుంటే నిద్రాహారాలు లేకుండా వ్రాసి ముగించడం సదానంద ప్రత్యేకత.

అలా వ్రాయగా రూపొందినదే బంగారు నడచిన బాట. ారుకోసం వేసిన కాలిబాటలాగే కనిపిస్తుంది. కాని మించిన, మహదర్థాన్ని యిందులో రసజ్ఞులు గమ రు.

పోగా —

సదానంద రచనకు - సరసులైన పాఠకులకు మధ్య ుతిక లవసరమని నేనుభావించను.

వ్రాసి పెట్టమన్న సదానంద తృప్తికోసమే ఈ నాలుగు మాటలు.

ఇది చివరి మాట :

"బంగారు నడిచిన బాట" మా సదానంద వచనంలో పాట.

వు,
-65. } — మధురాంతకం రాజారాం.

ఈ నవలను తొలిసారిగా తమ పత్రికలో ప్ర

విశేష ప్రచారమొనగూర్చిన ఆంధ్రసచిత్ర వార ప

సంపాదకులకు రచయిత కృతజ్ఞుడు.



నువ్వేదేనా మంచి పనిచేస్తే. మీ అమ్మ నిన్ను "మా
ంగారే" అంటూ మెచ్చుకుంటుంది కదూ? .... కనుక
ంచికి మరోపేరు బంగారు కానా? ....

బంగారయ్య నిజంగా బంగారే! ఒకవేళ బంగారుకంటే
ంచినది మరేదైనా వుందంటే - అది బంగారయ్యే! నా
ాటల్లో నీకు నమ్మకం లేకపోతే మీ ఊళ్లో మామిడి
పులో కూర్చుని పాటలుపాడే కోయిలమ్మ నడుగు. అటు
నే జామిచెట్లోని తేనెపలుకుల రామచిలుక నడుగు.
రంలో కాపురంచేసే పావురాయి నడుగు. లేదా
తిరిగివచ్చే మేఘాన్నడుగు. అవేం చెపుతాయో!

బంగారయ్య బంగారంత మంచివాడని వాటి భాషలో అన
పోతే నా చెవి కోసుకొంటాను. అయితే నీకు వాటి భా
తెలియదంటావా? దానికి నేను పూచీగాడు.

మామిడిచెట్లో కోయిల, జామిచెట్లో రామచిలుక
గుడిగోపురంలో పావురము, దేశాలు తిరిగే మేఘమూ
అన్నీకూడా బంగారయ్యను బంగారు అనే అంటాయి. గ
గలపారే సెలయేళ్ళతో – పచ్చని పచ్చిక తివాసీలావున్న
పెద్ద మైదానం. మైదానాన్ని ఆనుకుని ఒకచిట్టడవి.
వికి ఉత్తరాన ఎత్తైనకొండలు, కొండలకావల
కీకారణ్యం !

మైదానంలో ఒక చిన్నగుడిసె వేసుకుని తన
రత్నంతో కాపురంవుంటున్నాడు బంగారు. బంగారంలో
రత్నం అమరినట్లు వారిద్దరి దాంపత్యం చూడ ముచ్చ
గొలుపుతూ వుంటుంది. రత్నానికున్నవి రెండేరెండు అ
రణాలు. ఒకటి – ఆమె ముక్కున వున్న బంగారు బులాకీ
రెండు – తనభర్త బంగారు.

బులాకీ దానివన్నెచేత ప్రకాశిస్తే – బంగారుకు వన్నె
నిచ్చేవి అతని సుగుణాలు. అతడు ఏ ప్రాణిని హింసించలేదు
ఎప్పుడూ అబద్ధమాడలేదు. ఎవరికీ ఏ అపకారము చేయ
లేదు. మోసమూ, అన్యాయమూ అంటే ఏమిటో అతని
తెలియదు. ప్రేమ, దయ, సహనమూ, మంచితనము
త్రైన సుగుణాలన్నీ [illegible]
గుండె.

అతనికి పాతికాముప్పై వరకు కామధేనువుల వంటి పాడి ఆవులుండేవి. రోజూ వాటిని మైదానంలోను, చిట్టడవి లోను మేపుకుని సాయంకాలానికి యింటికి తిరిగి వచ్చేవాడు బంగారు. దూడలు త్రాగగా మిగిలినపాలే తాము పిదుకు కునేవారు. రత్నం ఆరుమైళ్ళ దూరానవున్న గ్రామానికి వెళ్ళి పాలు, పెరుగు, నేయి అమ్ముకుని వచ్చేది. రోజులు యిలా గడచి పోతున్నాయి.

వంటా — వార్పు, భర్తతోపాటు పాలుపితకడం మజ్జిగచిలకడం, వెన్నతీయటం, నేయికాచడం, అమ్ముకు రావడం, భర్త యింటవున్న వేళల్లో చిరునవ్వులుచిందే మోముతో కబుర్లు చెప్పడం, ఒంటరిగా వుండి తీరికగా వుంటే - తన బులాకీ సొగసు చూసుకుంటూ, తనభర్త మనసు ఊహించుకుంటూ మురిసిపోవడం - రత్నం నిత్య కృత్యాలు.

కాని బంగారో ?.........

ఉదయం లేచేవాడు. చిక్కంలో సంగటి వేసుకుని ఆవుల్ని తోలుకుని చిట్టడవిలోకి వెళ్ళేవాడు. ఆవులన్నీ మేస్తూ వుంటాయి. బంగారు పిల్లనగ్రోవిని ఊదుతూంటాడు. ఆ పిల్లనగ్రోవి పాటకు ప్రకృతి అంతా పులకించిపోతుంది. ఆకులు కదలడం మానేస్తాయి. పిట్టలుకూయడం ఆపివేస్తాయి. పిల్లగాలి ఆపాట వినడానికి వేగం తగ్గించి వేస్తుంది. ఆ కొండల్లో, కోనల్లోఅంతా బంగారు వేణుగానం మాత్రమే హాయిగా, మత్తుగా వినిపిస్తూ వుంటుంది. బంగారు బహుశా తన మనసులోని చల్లదనాన్ని, తీయదనాన్ని మేళవించి పిల్లనగ్రోవి వూదేవాడేమో ?.... ......

మధ్యాహ్నం కాగానే ఆవులు సెలయేటి పొడుగునా నిలబడి నీళ్ళుత్రాగి, అక్కడేవున్న మర్రిచెట్టునీడలో మేను వాల్చి నెమరు వేసుకుంటూ, మెళ్లో మువ్వలు గలగల లాడిస్తూ వుండేవి. బంగారు సంగటి బయటికి తీసేవాడు. పిట్టలన్నీ చుట్టూచేరేవి. బంగారు వాటికి కొంతవేసి తాను కొంత తినేవాడు. సెలయేటిలో నీళ్ళు త్రాగి చెట్టుక్రిందికి వచ్చి కూర్చునేవాడు.

మరుక్షణం – ఆ మర్రిచెట్టు కొమ్మలపైకి పావురాలు, రామచిలుకలు, గోరువంకలు, కోయిలలు, అన్నీవచ్చి వాలి పోయేవి. ఆవులు, అతని నాలుగు కాపలాకుక్కలు, పొద లలో నుండి కుందేళ్లు, ఉడుతలు, సీతాకోకచిలుకలు, నెమళ్లు అతనిచుట్టూ మూగేవి ఎందుకోతెలుసా?

బంగారు మంచి కథలు కోకొల్లలు చెప్పేవాడు.

ఒట్టి కథలేనా? .... నీతికథలు!

ఆ నీతికథల ద్వారా ఎన్నోనీతులు, మంచి మాటలు చెప్పేవాడు.

అతడు చెప్పని నీతి అంటూలేదు. నీ తెలుగుపుస్త కంలోవుంది చూశావూ – నీతి పద్యాలు – అవికూడా చెప్పే వాడు. పోయిన యేడాది వాచకంలో నువ్వు చదువుకున్న నీతిపద్యాలు కూడా చెప్పేవాడు. అతడు చెప్పిన మరికొన్ని నీతులు యింకా ముందు తరగతుల్లో నువ్వు తప్పక చూస్తావు....ఇలా ఎన్నో చెప్పేవాడు. మధ్యమధ్య వేదాంతం కూడా చెప్పేవాడు. చెప్పడమే కాదు. తాను తు. చ. తప్ప

కూడా అన్నీ పాటించేవాడు. అందుకే బంగారంటే అంత ఇష్టము, గౌరవము ఏర్పడినాయి — పశుపక్షాదులన్నిటికీ, అతడు చెప్పే ప్రతిమాటా శిరసావహించేవి అవి. ఎల్లవేళ ల్లోను అతని బోధనలే మననం చేసుకునేవి.

అంతేకాదు !

అవి బంగారును గురించి, ఆతని బోధనలను గురించి లోకమంతా ప్రచారం చేయసాగాయి. కోయిలమ్మ పాట లల్లింది. చిలుక కండచక్కెరవంటి పలుకులతో ఎలుగెత్తి చాటింది. కీచురాయి కమ్మని సీసపద్యాలల్లి గీపెట్టింది. పావురం కథలే ఏకరువు పెట్టింది. మలయ పవనం రాగ మాలికలు ఆలపించింది. విన్నవాళ్లు "ఓహో" అన్నారు. స్వార్థంకంటే గొప్పది ఏదీలేదనుకున్న వాళ్లు పెడచెవిని బెట్టారు.

Date 10-5-89
Time - 12-45 P.M.
[illegible]



## 2

బంగారు కథ అతడు నుడివిన బోధనలు చిట్టడవిని ఆనుకొనియున్న నీలికొండలమీదికి ప్రాకాయి. నీలికొండల కావల కీకారణ్యాలలోకి కూడా చొచ్చుకుపోయాయి. ఆ అడవిలో ఎన్నో జీవరాసులున్నాయి. లేళ్ళు, దుప్పులు, కణుతులు, కొండ గొర్రెలు, కుందేళ్లు, కోతులు, ఎలుగుబంట్లు, ఏనుగులు, అనేక రకాల పక్షులు లెక్కపెట్టలేనన్ని ఉన్నాయి. అవన్నీ బంగారు నీతులు విని ఆనందంతో పరవసించాయి. ఆ నీతులు వాటికి నచ్చాయి. మనస్సులో పదిలపరచుకొన్నాయి. తమ నిత్యజీవితంలో అచరణలో పెట్టసాగాయి.

ఆ అడవిలో ప్రతిరోజూ ఏదో ఒక వేడుక జరిగేది. కోయిల పాటకచ్చేరి చేసేది. తన తీయని గొంతుతో బంగా

రును కీర్తించేది. తేనెవాగులవంటి నీతిపాటలు పాడేది. అడవిలోని జీవాలన్నీ ఆ పాటలు నేర్చుకున్నాయి. రామచిలుక కాళ్ళకు గజ్జెకట్టి మెడలో దండలు ధరించి, రెక్కలతో చిటికలువేస్తూ కథాగానం చేసేది. ఆ కథలన్నీ జీవరాసులు విని తమ పసిపాపలకు చెప్పేవి. అప్పుడప్పుడు అడవిలో నాటకాలు కూడా జరుగుతుండేవి. గౌతమబుద్ధ, సత్య హరిశ్చంద్ర, శిబిచక్రవర్తి, రంతిదేవుడు, రామాయణం, నలదమయంతి మొదలైన నాటకాలన్నీ జరిగేవి. నటించగల ప్రతిభవున్న ప్రతిపక్షి, ప్రతిజంతువు తమకు తగిన వేషాలు ధరించేవి.

క్రమంగా అరణ్యమంతా ఒక పవిత్రభూమిగా మారిపోయింది. ఎక్కడచూచినా మంచి మాటలే! ఎక్కడ చూచినా మంచిచేతలే! ఎవరిలో చూచినా మంచి ఉద్దేశాలే! చెడు అన్నమాటకు ఆ అరణ్యంలో తావే లేకపోయింది. దొంగతనము, మోసము, ప్రాణభయము, అత్యాచారము అన్నీ అంతరించిపోయాయి. ఆ అరణ్యం ప్రతి అంగుళం మేరలోను శాంతి, ప్రశాంతి, సంతృప్తి కాపురం చేయసాగాయి. అడవిలో ప్రశాంతతకు భంగకరమైన గొడవ ఏదీ జరిగేది కాదు. అక్కడి ఆకాశంలో గట్టిగా ఉరమడానికైనా ఉరుము భయపడేది. నీలికొండల మీది రాయి క్రిందికి పొర్లడానికి వెరచేది. ఎక్కడి నుంచో పరిగిడివస్తున్న తుఫాను అడవి దగ్గరకు రాగానే అడుగు కదపలేక తడబడేది. వెదురు బొంగుల సందుల్లో పుట్టిన కార్చిచ్చు అక్కడికక్కడే చల్లారిపోయేది. ఎంతలో ఎంత మార్పు! .... ఆ అరణ్యంలోని జీవరాసులన్నీ మంచివి.

మంచివారిని నాశనం చేసే శక్తి, సాహసం ఎవరి కున్నాయి?

"ఇదంతా బంగారు చలవ! ఎంత చల్లని హాయైన బ్రతుకు నిచ్చాయి అతని మాటలు! బంగారు ఎక్కడివాడో, ఎలా వుంటాడో, అయితే నేం? అతడు తన సూక్తుల ద్వారా మన గుండెల్లోనే వుంటున్నాడు. మన కన్నుల్లోనే మెదులు తున్నాడు. బంగారు మనిషి కాదు. దేవత! .... లోకానికి శాంతి ప్రబోధం చేయవచ్చిన శాంతిదూత!" అనుకున్నాయి అరణ్యంలోని జీవాలు.

ఆ అరణ్యంలో ఒక పెద్ద పులి ఉండేది. దాని పేరు సర్వమంగళం! దాని పేరు ఎంత సరళమో, దాని హృదయం అంత కఠినం. అది ఆ అడవికంతా రాజు! అది కూడా చిలుక పలుకులు, కోయిల పాటలు వింటూనే ఉంది. తన రాజ్యంలో జరిగే మార్పంతా చూస్తూనే ఉంది. అది తన జీవితంలో ఎన్నో ఘాతుక కార్యాలు చేసింది. ఎన్నో జంతువులను తన పొట్టన పెట్టుకుంది. ఇప్పుడు ముసలిదై పోయింది. పరుగెత్తి వేటాడే ఓపిక క్రమంగా సన్నగిల్లి పోతున్నది. దాని కెంతో బంగారు బోధనలపట్ల కుతూహలం కలిగింది. తనకు, బంగారుకు తూర్పు పడమర లంత తేడా వుంది. తన రాజ్యంలో ప్రజలంతా బంగారును దేవుడంటు న్నారు. తనను రాక్షసుడని వారు భావింపవచ్చునుకదా?

ఒకనాడు — అడవిలోని జంతువులను సమావేశ పరచవలసిందని తన నేస్తమైన గ్రద్దతో చెప్పింది పులి. గ్రద్ద చెప్పిన ఆకాశాన కెగిరి, అడవియంతా వలయాలు తిరు

గుతూ "పులిరాజు జంతువుల నన్నిటినీ సమావేశం కమ్మం టున్నారహో!" అంటూ దండోరా వేసింది. ఈ దండోరావిని జంతువులన్నీ గుండెలు అరచేతిలో పెట్టుకుని అరణ్యా మధ్యంలో సమావేశమైనాయి. అవి సమావేశమయ్యే తీరు తమాషాగా ఉంటుంది. పులిరాజుకు అందుబాటులో ఏ జంతువూ నిలబడదు. ఎలుగుబంట్లు చెట్ల మొదళ్లలో నించు న్నాయి .... ఏనుగులు చూపులు పులిరాజు మీదనే కేంద్రీక రించి, చెవులు వెనక్కి నిక్కించి, తొండాలు పైకెత్తి నిల బడ్డాయి. కుందేళ్లు పొదలమాటునుంచి తొంగి చూస్తున్నాయి. దుప్పులు, లేళ్లు, కణుతులు దూరంగా రాళ్ల వెనుక – పులి మీదికి దూకితే పరుగందుకునేంత హుషారుగా నుంచున్నాయి. కోతులు చిటారు కొమ్మలమీద కూర్చున్నాయి. పక్షులన్నీ ఆకులపరదాల్లోంచి క్రిందికి నిక్కిచూస్తున్నాయి.

పులి – మధ్యలో ఎత్తైన ప్రదేశంలో కూర్చున్నది. దాని ముఖం విచారంతో నిండివుంది. కొంతసేపు అడవిలో ఆకు రాలితే వినిపించేంత నిశ్శబ్దత నెలకొంది. పులి హఠా త్తుగా బావురుమంటూ ఏడువసాగింది. దాని రొమ్ములు వెక్కిళ్ళతో ఎగిరెగిరిపడ్డాయి. చెంపలమీద కన్నీరు కాలు వలు కట్టింది. జంతువులలో సంచలనం బయలుదేరింది. "పులిరాజు ఏడుస్తున్నాడు! .... పులిరాజు .... ఏడుస్తున్నాడు! ........ అంటూ ఆశ్చర్యపోయాయి.

"సోదరులారా!" అన్నది సర్వమంగళం.

మళ్ళీ నిశ్శబ్దత వ్యాపించింది.

"సోదరులారా! నేను మహాపాపిని! ఇన్నాళ్లో — మీరంతా నా సోదరులన్నమాట మరిచిపోయాను. నా నికృష్టపు కడుపుకోసం ఎందరు సోదరులు బలైపోయారో తలుచుకుంటే - నా గుండె నీరైపోతున్నది. ఇంత కాలమూ - అజ్ఞానంలోపడి కొట్టుకులాడాను. మిమ్మల్ని కన్న తండ్రిలా పాలించవలసిన నేను మీ పాలిట మృత్యువుగా బ్రతికాను. ఈనాడు — మహానుభావుడు బంగారు నాకళ్లు తెరిపించాడు. నా తప్పు నాకు తెలిసి వచ్చింది. నా హృదయం పశ్చాత్తాపంతో రగిలిపోతున్నది. జీవితం మీద రోతపుట్టింది. చచ్చిపోవాలనుకున్నాను. మిమ్మల్ని రెండు కోరికలు కోరుతున్నాను. నా పాపాలను క్షమించామనండి. తరువాత మీరందరూ కలిసి నన్ను చీల్చి చెండాడేయండి. ఈ లోకం నుండి తృప్తిగా వెళ్ళిపోతాను ...." అంటూ కడివెడు కన్నీరు కార్చింది సర్వమంగళం.

జంతువులు పొందిన ఆశ్చర్యం యింతాఅంతాకాదు. ఇదేమి వింత! పులిరాజేనా యిలా మాట్లాడుతున్నది. దయ, ప్రేమ ఏ కోశానాలేని తమ రాజేనా ఈ మాట లంటున్నది.? అవి నమ్మలేకపోయాయి. ఆశ్చర్యంతో కళ్లు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయాయి.

పులిరాజు రోదిస్తూనే ఉన్నాడు. తన పాపాలకు పశ్చాత్తాపం వెలిబుచ్చుతున్నాడు. "నన్ను క్షమించామని ఒక్కసారి అనరా? ఈ నీచ జన్మనుంచి నాకు ముక్తిని ప్రసాదించరా? ......"

"క్షమించా"మని ఏ జంతువూ అనలేదు. పులి చంపమంటున్నా దాన్ని చంపడానికి అవి ప్రయత్నించలేదు. పులి

మాటలు నమ్మవచ్చునా, నమ్మకూడదా — అని అవి నిర్ధారణ చేసుకోలేకపోతున్నాయి.

రెండు రోజులైనా పులి కూర్చున్న చోటునుంచి కదలేదు. ఆ రెండు రోజులూ దానికి ఆహారం కూడా లేదు. దాని ఆవేదన చూచి జంతువుల మనస్సులు ఎండవేడి తగిలిన మంచుగడ్డల్లా కరుగసాగాయి.

"సోదరులారా! నన్ను క్షమించామనరా? అయ్యో! .... మీరే నన్ను మన్నించలేకపోతే — నాకిక పుట్టగతులుంటాయా? .... దేవుడా! .... నన్ను క్షమించు! .... నన్ను క్షమించు! .... అంటూ సర్వమంగళం మూర్ఛపోయింది.

జంతువులకు తమ రాజు మీద జాలికలిగింది. "పాపం! పులి చేసిన పాపాలు దాన్నిప్పుడు యిలా దహించివేస్తున్నాయి. అది పశ్చాత్తాపం చెందుతున్నది. దాని మనస్సు నిజంగానే మారిపోయింది.

అంతా బంగారు మహిమ!!" అనుకున్నాయి అవి. తమ రాజు మంచివాడైపోయినందుకు సంతోషించాయి.

ఏనుగు పరుగు పరుగున వెళ్ళి, దగ్గరలోనున్న కాలువలోనుండి తొండంతో నీళ్ళుతెచ్చి, దూరంనించే పులిముఖం మీద చిమ్మింది. పులికి తెలివి వచ్చింది. నీరసంగా కళ్ళు తెరిచి చూచింది.

"పులిరాజా! నిన్ను క్షమించాము. నీ పాపాలను కడిగి వేయమని దేవుణ్ణి వేడుకుంటున్నాము." అన్నాయి జంతువులు ఏకకంఠంతో.

"ఆనందం! పరమానందం! సోదరులారా! దేవుడు మిమ్మల్ని కాపాడుగాక!" అంటూ ముందరికాళ్లెత్తి నమస్కరించింది పులి. "ఈజీవితం యిక చాలు! ప్రజానురంజకంగా పాలించలేని ఈ పదవి కూడా యిక వద్దు. మీకు యిష్టం వచ్చిన రాజును మీరు ఎన్నుకోండి! రండి! ఒక్కుమ్మడిగా నాచుట్టూ చేరి, ఆ లోకానికి సాగనంపండి.!" అంటూ దైవాన్ని స్మరిస్తూ కళ్ళు గట్టిగా మూసుకొంది. రెండు క్షణాల తరువాత మళ్ళి కళ్ళు తెరచింది .... జంతువులు దగ్గరికిరాలేదు.

పులి కృతనిశ్చయంతో – "సరే!....నాకు చావాలని ఉన్నది. మీరేమో నన్ను చంపరు. ఇక నేనే ఆత్మహత్య చేసుకుంటాను. దూరంగావున్న ఆ కొండకొమ్ము పైకి వెళ్ళి క్రింది లోయల్లోకి దూకి చచ్చిపోతాను. పోయివస్తాను. మీకందరికి శుభమస్తు!" అంటూ లేచి ఒళ్ళు దులుపుకొని మెల్లగా బలహీనంగా నడువసాగింది.

కాని అదిఅలా పదిఅడుగులైనా నడువలేదు. అంతలో- అడవిలోని జంతువులన్నీ అన్నివైపులనుండి పులిని సమీపించి, భక్తి గౌరవాలతో దానిముందు మోకరిల్లాయి. "రాజా! భృత్యులము – నీకాళ్ళనంటి వేడుకుంటున్నాము. మమ్మల్ని కరుణించు, నువ్వు చచ్చిపోవద్దు. ఎన్నిజన్మల పుణ్యఫలమో – ఈనాడు మారాజు దయాసాగరుడైనాడు. ఆ దయారసం మాకు లేకుండా చేస్తావా? .... మమ్మల్ని దిక్కులేనివారిగా చేస్తావా? .... మేము ఉవ్విళ్ళూరుతున్న నీ చల్లని దొరతనం నేడు ఎండమావి చేస్తావా?...." అంటూ ప్రాధేయపడ్డాయి.

"బిడ్డలారా! నన్ను పోనివ్వరా? నన్ను మళ్ళీ ఈ బంధంలో ఇరికిస్తున్నారా? .... వద్దుబాబూ! వద్దు! దయచేసి దారితొలగండి. నన్ను పోనివ్వండి!" అంటూ ముందుకు సాగబోయింది పులి.

జంతువులు దాన్ని పోనివ్వలేదు. రాజుగారి కాళ్ళు పెనవేసుకున్నాయి. "రాజా! నిన్ను పోనివ్వం! ఏలుకుంటే మమ్మల్ని ఏలుకో! కాదంటావా? మమ్మల్నందరినీ చంపేసి నీదారి నువ్వు చూసుకో!" అంటూ భీష్మించాయి.

పులి కొంతతడవు ఆలోచించింది. తల పంకించింది. పెద్దగా నిట్టూర్పు విడిచింది. "సరే! .... నేను చావాలనుకున్నాను. మీరేమో వద్దని పట్టుబడుతున్నారు. మీకోసం ఈ త్యాగం చేయక తప్పడంలేదు. మీ యిష్టమే నా ఇష్టం!" అంది.

జంతువులన్నీ సంబరంతో తమ రాజును పైకెత్తేశాయి. "పులిరాజుకు జై" అంటూ అరణ్యమంతా ప్రతిధ్వనించేలా హర్షధ్వానాలు చేశాయి.

Date = 10-5-89
Time = 1-20 ఆంట
After ))
noon }



## 3

ఆనాటి నుండి సర్వమంగళంలో చాలా మార్పు వచ్చింది. ఇన్నాళ్లూ భయంకరంగా ఉంటూ ఉండిన దాని గాండ్రింపు ఇప్పుడు చాలా మృదుమధురంగా ఉంది. నిప్పు రవ్వల్లా భగ భగ మండే దాని కళ్లు వెన్నెలసోనల్లా చల్లగా ఉన్నాయి. అది సాటి ప్రాణిని చంపి తింటూ ఉండగా ఎవరూ చూడలేదు. "పులి మాంసాహారం మానేసింది. కేవలం గాలి, నీతి, నీటితోనే జీవిస్తున్నది!" అని చెప్పుకో

సాగినవి జంతువులు. వాటిలో ప్రాణభీతి, భేద భావము నశించిపోయాయి. జీవాలన్నీ పులి దగ్గర చేరుతున్నాయి. గోపుపద్ద ఉన్నంత చనువుగా ఉంటున్నాయి. పులి కంట బడినా, దాని గాండ్రింపు విన్నా ఆమడ దూరం పరుగెత్తే దుప్పి, చెవుల పిల్లికూడ ఇప్పుడు పులి ఒంటిని రాచుకుని తిరుగుతున్నాయి .... .... పులికి మంచి గౌరవం ఏర్పడింది. "పులి రూపంలో ఉన్న బంగారా ఈ పులిరాజు?!" అనుకునేవి జంతువులు అప్పుడప్పుడూ.

పులి గుహలో ఒక పాత తంబూరా ఉంది. చాలా కాలం క్రిందట ఒక దాసరి ఆ అడవి దారిని పోతూంటే, అతన్ని తన గుహలోకి లాక్కువచ్చి ఆరగించింది పులి. ఆ తంబూరా ఆ దాసరిదే! దాని కంటుకుని ఉన్న దుమ్మంతా దులిపింది పులి. గుహ ముందు కూర్చుని తంబూరా మీటుతూ తత్వం పాడుకోవడం దానికి నిత్యకృత్యమయిపోయింది. జంతువులు తమకు తీరికగా ఉన్నప్పుడు పులి దగ్గరవచ్చి కూర్చుని తత్వాలు వినేవి.

ఒకనాటి సాయంకాలం సర్వమంగళం తన గుహ ముందు కళ్లు మూసుకుని కూర్చుని, జపంలో మునిగి పోయింది. ఆ దారిని పోతున్న చెవుల పిల్లి దాన్ని సమీపించి "పులిరాజా! పులిరాజా!" అంటూ కదిపింది.

సర్వమంగళం కళ్లు తెరచి కుందేలును చూచింది.

"ఏం బాబూ?" అంది ఆప్యాయంగా. "ఏదీ ఒక తత్వం పాడి వినిపించవేయవూ?" అని అడిగింది కుందేలు.

"ఒకటేమిటి? ఎన్ని కావాలన్నా పాడి వినిపింపజేయటానికి సిద్ధంగా ఉన్నాను బాబూ! ఈ జన్మకు ఇంతకంటే ఇంకేం కావాలి.?" అంటూ చుట్టూ చూసింది పులి. చుట్టూ పెద్ద పెద్ద రాతి బండలు. బండల అంచుల్లో ఆకాశం కనిపిస్తున్నది.

చెవులపిల్లి ప్రీతితో వింటూ ఉండగా — పులి తంబూరా మీటుతూ తత్వం అందుకొంది.........

"ఏ నిముసమొస్తుందో, ఏ త్రోవనొస్తుందో
ఎవరు చెప్పాగలరు మనసా —
చావు నిను తినగోరు సందర్భమెప్పుడో
చెప్పుకోగలవటే మనసా —
మట్టిలో పుట్టేది మట్టిలో కలిసేది
గట్టిదా ఈ తిత్తి మనసా —
కనుమూసి తెరిచేటి కాలమ్ము లోపలే
కాయమే గుటకాయ స్వాహా!........"

మరుక్షణం — చెవులపిల్లి తన చోట్లో లేదు! ఏమైంది? ఏమైందో ఎవరికీ తెలియదు? సర్వమంగళం మాత్రం త్రేవు మని త్రేన్చింది. తత్వం తంబూరా కట్టిపెట్టి గుహలోపలికి నడిచింది. హాయిగా పడుకుని ఆనందంగా నవ్వుకొన్నది.

దాని పరిస్థితి ఇప్పుడు మునుపటికంటే ఎన్నో రెట్లు మెరుగ్గావుంది. కష్టపడి వేటాడనవసరం లేకుండానే కబళం తనంతట అదే నోటి దగ్గరికి, వచ్చేస్తున్నది. సులభంగా వచ్చిన సౌకర్యమా ఇది? ఎంత తెలివి! ఎంత చాకచక్యమూ ప్రదర్శించింది తను!........ తన ప్రాణాన్నికదా ఎరగా

పెట్టింది! "నన్ను చంపివేయం"డంటూ కళ్లుమూసుకున్నప్పుడు జంతువులన్నీ కలిసి అందుకు సిద్ధపడిఉంటే తన గతి ఏమై ఉండేది! ........ అయితే తనకు రోజులు బాగున్నాయి. జంతువులన్నీ సులభంగానే తన బుట్టల్లోపడ్డాయి. ఈ పూట తన పొట్టలో పడటం కుందేలు వంతైంది. పాపం! ........ అంతేమరి! .... చావు ఎప్పుడు వస్తుందో, ఎట్లా వస్తుందో ఎవరు చెప్పగలరు?

Date = 10-5-89
= Afternoon
Time = 2-00
X

18



## 4

చిట్టడవికి వాయవ్యంగా నీలికొండల చివరఉన్న కనుమలో గలగలా ప్రవహించే కొండవాగు ప్రక్కన టక్కుటమారం నిలబడి ఉన్నది. వాగులోని చేపలు, బొరియల్లోంచి తొంగిచూచే ఎండ్రకాయలు ఎండ తగిలి మిలమిలా, తళతళా మెరిసిపోతున్నాయి. టక్కుటమారం ముఖం నిండుకు, ముసి ముసి నవ్వులు మెరిసిపోతున్నాయి. అది వాగుగట్టు వెంబడి కొన్ని అడుగులు అటూ ఇటూ నడిచింది. ఎండ్రకాయ బొరియల్ని పరీక్షించింది. ఒక బొరియలోకి తోకను జొనిపి, తన తోకకేసి వోరకంటచూస్తూ కూర్చుంది. తోకను ఏదో పట్టుకున్నట్లనిపించింది దానికి. చటుక్కున

తోకను విసురుగా బయటకు లాక్కుంది. బొరియలో నక్కి వుండిన ఎండ్రకాయల రాయడు తోకతోబాటు ఎగిరి బయట పడ్డాడు. టక్కుటమారాన్ని చూచి "బాబోయ్! నాయనోయ్! నువ్వా? పొట్టినక్కవా?" అంటూ గడగడ లాడిపోయాడు. "అవును రాయడా! నేనే!.... రా! నీకు స్వాగతం!" అంటూ ఆహ్వానించింది నక్క. ఎండ్రకాయలరాయడు మొర్రోమంటున్నా వినిపించుకోకుండా – తన ఉదర సామ్రాజ్యానికి ఏలికను చేసేసింది.

కొంతసేపు గడిచే సరికి ఇలా చాలినన్ని ఎండ్రకాయలు వేటాడి తినింది నక్క. తరువాత నోరు చప్పరించి, త్రేన్చి, పక్కనున్న పొదల చల్లని నీడలో హాయిగా విశ్రమించింది.

ఎండ చురుకెక్కింది. చిట్టడవిలో నుండి సన్నగా, హాయిగా పిల్లనగ్రోవి పాట తేలివస్తూ ఉంది. పడుకుని ఉన్న నక్క ఏదో ఆలోచిస్తూ ఆ పాట వినసాగింది.

....ఆ పాట వాయిస్తూన్నది బంగారేనేమో! .... బంగారుసు గురించి నక్క ఇప్పటికే విని ఉన్నది. అతడు చాలా మంచివాడట! గోవుకన్నా సాధువట! అతనివద్ద బాగా బియ్యబలిసిన ఆవులు, దూడలు చాలా ఉన్నాయట!........ బంగారును కలుసుకోవాలని, అతని స్నేహం సంపాదించాలని నక్క చాలా రోజులనుండీ ఉవ్విళ్ళూరుతున్నది.

నక్క పైకి లేచింది. వాగుగట్టు వెంబడే నడువసాగింది. కొంతసేపటికి చిట్టడవి చేరుకుంది. బంగారును దూరంనుంచి చూచింది. అతడు మర్రిచెట్టు నీడలో కూర్చుని

మురళి వూదుతున్నాడు. పిట్టలు కొమ్మలపై కూర్చుని పాట వింటున్నాయి. గోవులు పచ్చిక మేస్తున్నాయి. నాలుగు కుక్కలూ గోవుల్ని కాస్తూ తలొకదిక్కున నాలుకలు బార జాపి కూర్చుని ఉన్నాయి. నక్క గోవుల్ని లెక్కపెట్టాలని ప్రయత్నించి, లెక్కపెట్టలేక పోయింది. కుక్కలు కంటబడి నప్పటినుంచి దాని గుండె గుబగుబ లాడుతున్నది. అయినా "ధైర్యే సాహసే గోలక్ష్మీ" అనుకుని బంగారుకు వినబడేలా బిగ్గరగా దీనంగా — "పతిత పావనా! బంగారు నామా! పాహి! పాహి!" అంది. ఈ వూళ విని నాలుగు కుక్కలూ చిటికెలో నక్కజాడ పసిగట్టి, దాని మీదికి ఉరికాయి.

"అన్నలారా! నేను మీ సోదరుణ్ణి! మన జాతి పేర్లలో ఉన్న పోలికను గమనించండి. మీరు కుక్కలు, నేను నక్కను. మనమంతా ఒకటే! మీ స్నేహం కోరి వచ్చినవాడను శాంతించండి." అంది నక్క.

కుక్కలు వినలేదు. "నీ వాలకం చూస్తే జిత్తులమారి లాగున్నావు. నీ మాటలు మేము నమ్మము. నీ పేరు నక్కయ్యే అయినా, మీ ఇంటిపేరు టక్కరే కదా?" అంటూ అవి నక్కను కరువబోయాయి. నక్క "హా! బంగారన్నా! నిరపరాధిని! ఆపదలో ఉన్నాను. రావా? రక్షింపవా?" అంటూ గొంతు చించుకుంది. ఈ కేకలు చెవినిబడేవరకు ఈ గొడవంతా బంగారుకు తెలియదు. అతడు నక్క దగ్గరికి పరుగు పరుగున వచ్చాడు. కుక్కలను శాంతించమన్నాడు. "ఆవేశం తగదన్నానా? ఎన్ని చెప్పినా మీ మనస్సులు మాత్రం మార్చలేకుండా పోతున్నాను." అంటూ వాటిని

పుంపలించాడు. "నక్కబాబూ! వాటి తొందరపాటుకు ఏమనుకోకు!" అన్నాడు నక్కతో.

నక్క బంగారును రెప్పలార్పకుండా కొద్ది క్షణాలు చూచింది. "నువ్వేనా? నా బంగారువి నువ్వేనా? నేను పిలిచిన బంగారన్నవు నువ్వేనా? ............ ఈనాడెంత సుదినం!........ నా జన్మ పావనమై పోయింది!........" అంది పట్టరాని సంతోషంతో.

"నీ బంగారు ఎవరో నాకు తెలియదు. కానీ నా పేరు కూడా బంగారే! నువ్వు అనుకుంటున్న బంగారు నేనే అయితే— నానుండి నువ్వు కోరేదేమిటో చెప్పు!" అన్నాడు బంగారు.

"బంగారన్నా! ఆ మాట చాలు! నిన్ను చూడాలని చాలాకాలంగా అనుకుంటున్నాను. ఈనాడు నా కోరిక నెరవేరింది. నువ్వు సెలవిచ్చిన నీతులు నా మనస్సులో నాటుకున్నాయి!.... మంచితనం నేర్చుకుంటున్నాను. మాంసాహారం మానేశాను. ఇప్పుడు ఎండ్రకాయలు నా వీపుమీదికి ఎక్కి ఆడుకుంటున్నాయి. నువ్వు నమ్మితే నమ్ము, నమ్మకపోతే పో — నేటికి అయిదు రోజులనుండి పచ్చి మంచినీళ్ళతో ప్రాణాలు నిలబెట్టు కుంటున్నాను. నా ఆకలి సమస్యను నువ్వు తీర్చలేకుండా పోతావా అనే ఆశతో నీ కోసం వచ్చాను. ఆకలి! హా! కలి!" అంది నక్క.

"అయ్యో పాపం! అయితే ఒక్క క్షణం ఆగు అంటూ బంగారు — సమీపంలోని ఒక చిన్న మడుగులోనుండి పెద్ద పెద్ద తామరాకులు రెండు త్రుంచుకొచ్చాడు. వాటిని గిన్నెలా చుట్టి దాని నిండుకు ఆవుల పాలు పిదికాడు. నక్కకిచ్చి త్రాగ

మన్నాడు. నక్క గుటగుటా త్రాగి, "అమ్మయ్య కడుపు నింపావు! పోయిన ప్రాణం లేచి వచ్చింది. ఆవుపాలు చాలా రుచిగా ఉంది!" అన్నది. "ఆవుపాలే ఇంత రుచిగా ఉంటే ఆవు మరెంత రుచిగా ఉంటుందో!" అని కూడ అనబోయి నాలుక కరచుకొంది.

"మా ఇంట్లో అందరమూ పాలే త్రాగుతాము, మా కుక్కలు, పిల్లులు కూడా పాలే త్రాగుతాయి. నీ ఒక్కడికి పాలు ఇవ్వలేకపోతానా ? .... నీకు ఆకలైనప్పుడల్లా వచ్చి పాలుత్రాగి పోవచ్చు" అన్నాడు బంగారు.

"బంగారన్నా! పాలతో నా ఆకలి సమస్య తీర్చావు. పాలవంటి నీ మనస్సులోకూడ నాకు పాలు పంచిపెట్టవా? మనమిద్దరం ఒక తల్లిబిడ్డల్లా ఉండటానికి వీలులేదా?" అంది నక్క.

"ఎందుకు వీలులేదు ? ఈ భూమాతే మన తల్లి! దేవుడే మన తండ్రి! సకల జీవరాసులూ అన్నదమ్ములే !" అన్నాడు బంగారు.

"అయితే నీ నోరారా నన్ను తమ్ముడా అని పిలువు — చాలు!" అని ప్రాధేయపడింది నక్క.

దాని ప్రార్థన మన్నించాడు బంగారు. "తమ్ముడా నీ అన్నతో ఉన్నంత చనువుగా నువ్వు నాతో ఉండవచ్చును. ఈ నాటినుండి మనమిద్దరం అన్నదమ్ములమే!"

నక్క సంతోషానికి మేర లేకపోయింది. అది ఆనాటి నుండి ప్రతిరోజూ బంగారువద్దకు వచ్చేది. కావలసినంత పాలు

త్రాగేది. బంగారు చెప్పేనీతులు శ్రద్ధగా వినేది. సాయంకాలం కాగానే, తాను నివసించే కనుమలోకి వెళ్ళిపోయేది.

తన ఘనతను చాటుకోడానికి దానికిప్పుడు మంచి పట్టానే దొరికింది. "నేను బంగారన్న తమ్ముణ్ణి! బంగారు మా అన్న! బంగారన్న కష్టసుఖాలలో నాకు సమపాలున్నది. నా కష్టసుఖాలలో అతనికీ సమపాలున్నది!" అని బంగారు ఆవులు సేద దీర్చుకునే మర్రిచెట్టు వద్దనుండీ, తాను పుట్టి పెరిగిన కనుమవరకు అందరితో చెప్పుకుంది. ఆకాశ సంచారం చేసే పిట్టలకు కూడ చెప్పుకుంది.

అన్నదమ్ముల చెలిమి నిరాటంకంగా కొనసాగి పోతూనే ఉంది. ఒకనాడు నక్క బంగారంతో ఈ విధంగా అన్నది........"బంగారన్నా! అనగా అనగా ఒక వూళ్లో ఒక గొప్ప ధనవంతుడుండేవాడు. అతనికి ఇద్దరు కొడుకులుండే వారు. ఆ ధనవంతుడికి అవసానకాలం సమీపించింది. అతడు చచ్చిపోయాడు. అప్పుడు రెండవ కొడుకు దేశాంతరంలో ఉన్నాడు. కొంతకాలానికి అతడు తిరిగివచ్చాడు. ఆస్తిలో తన పాలు తనకిమ్మని అన్నను అడిగాడు. అందుకు అన్న ససేమిరా—వీల్లేదన్నాడు. ఒక చిల్లి గవ్వకూడ ఇవ్వనన్నాడు ........ఇది న్యాయమేనా ? ఆ చిన్నవాడి గతి ఏం కావాలి? ....నువ్వే అన్నవైతే ఏం చేసేవాడివి ?"

"అది ఎంతమాత్రం న్యాయంకాదు. ఆ ఆస్తిలో అన్న కెంత హక్కుందో తమ్ముడికీ అంతే హక్కుఉంది. నేనే అన్న నైతే నా తమ్ముడికి సంతోషంగా సమభాగం ఇచ్చేసే వాడిని!" అన్నాడు బంగారు.

"అయితే అన్నయ్యా! నీవద్దవున్న ఆవులన్ని నాకు సంతోషంగా ఇవ్వరాదా?...." అన్నది నక్క.

ఇది విని బంగారు నిర్ఘాంతపోయాడు.

"పలకవేం?" అంటూ రెట్టించింది నక్క.

బంగారు ఇంకా విస్మయంలోంచి తేరుకోలేదు!

నక్క బంగారును అసహ్యించుకుంది. "ఛీ నిన్ను గొప్పవాడనుకున్నాను. పొరబాటు!....నీలో ఇంత స్వార్థం ఉందనుకోలేదు. మనం అన్నదమ్ములమని ఎందుకన్నావు? అంతా బూటకం! భాగం అడుగగానే ముఖం ఎలా వెలవెల బోయిందో చూడు! నేను నీ సోదర ప్రేమను పరీక్షిస్తున్నా నని ఎందుకనుకోగూడదు.? ఛీ! నీ కడుపులో ఇంత కపటం ఉందని ముందే తెలిసి ఉంటే నీతో చెలిమిచేసి ఉండేవాడి నేనా?........ వెళ్ళివస్తాను సోదరా! నీమైత్రికి నా స్వస్తి!" అంటూ నక్క వెళ్ళిపోబోయింది.

వెంటనే బంగారు ఆపేశాడు. "అయ్యో తమ్ముడూ! తొందరపడకు! నన్ను అపార్థం చేసుకోకు! నువ్వు నా తమ్ముడివని ఎప్పుడన్నానో—అప్పుడే నీకు నా సంపదలో భాగమేర్పడింది. నా ఆవుల్లో కొన్నిటిని నీకు హృదయ పూర్వకంగా సమర్పిస్తున్నాను. తీసుకుపో!" అన్నాడు.

కుక్కలు మాత్రం ఇందుకు అసమ్మతిని తెలియ జేశాయి.

"స్వామీ! ఈ నక్క ఏకులా వచ్చి మేకై కూర్చొం టుందని మొదటి నుంచి మేము అనుకుంటూనే ఉన్నాము.

మొదటిసారిగా దీని ముఖం చూడగానే తెలిసిపోయింది. ఇది జిత్తులమారిదని. ఇప్పుడు మనవేలితో మనకన్నే పొడవ జూస్తున్నది. దీనికి ఒక్క ఆవుకూడా ఇవ్వవద్దు. నువ్వు ఊ అను — దీని డొక్క చీల్చి, డోలుకట్టించి, దీని మోసాన్ని గురించి దండోరా వేయించేస్తాం." అన్నాయి అవి ఆగ్రహావేశంతో.

"ఆగ్రహావేశాలు తగవన్నానా? ఎన్నిచెప్పినా మీ వారే మీది. వూరుకోండి!" అన్నాడు బంగారు. అతడు తన మందలోంచి అయిదు మంచి ఆవుల్ని ఏరాడు. "తమ్ముడూ! నా కుటుంబం పెద్దది. నేను నా భార్య, నా కుక్కలు, పిల్లలు, నా అతిథి అభ్యాగతులు అందరూ ఈ ఆవులమీదనే ఆధారపడి ఉన్నాం. కాబట్టి నీకు అయిదు ఆవుల్ని ఇస్తున్నాను. ఈ అయిదు ఆవులూ అయిదు జీవనదులవంటివి. వాటి పాలతో నీ బ్రతుకు హాయిగా గడచిపోతుంది. వీటిని తీసుకో!........నువ్వు ఎప్పుడూ నా తమ్ముడివే!" అంటూ ఆ ఆవుల్ని నక్కకు ఇచ్చివేశాడు. "ఇకనుంచి మీరు నా తమ్ముడి సొత్తు. అతనితో వెళ్ళండి!" అన్నాడు ఆ ఆవులతో.

నక్క ఆనందంతో మైమరచి పోయి, కల్లుత్రాగిన కోతిలా నాట్యం చేస్తూ ముందు నడిచింది. అయిదు ఆవులూ దాన్ని అనుసరించాయి. కుక్కలు మాత్రం అక్కసు పట్టలేక పోయాయి. "అంతా నటన! చూస్తూ ఉండు. అది ఆవుల్ని ఒక్కటొక్కటిగా పొట్టన బెట్టుకుని, మళ్లా ఏదో ఎత్తు వేయకపోతే?........" అన్నాయి బంగారుతో.

"శాంత! శాంత!" అన్నాడు బంగారు.



## 5

నిండు చందమామ పండు వెన్నెలలు కురిపిస్తున్నాడు. వెన్నెల్లో నీలాకాశం ప్రకాశవంతంగావుంది. బంగారు సరిగతో కుట్టిన పువ్వుల్లా అక్కడక్కడా చుక్కలు తళుకుమంటూన్నాయి. తెల్లని మేఘాలు దూది పింజల్లా తేలియాడుతున్నాయి. ఇంత అందంగా వున్న ఆకాశంలో చాల ఎత్తున విహరిస్తూ నేల వైపు తీక్షణంగా చూస్తున్నది గ్రద్ద. పండు వెన్నెలలో అడవులూ, కొండలూ, మైదానాలూ అన్నీ అద్దంలోంచి చూచినట్లు స్పష్టముగా కనిపిస్తున్నాయి దానికి.

గ్రద్ద ఆకాశంలో సంచరిస్తూ – అడవిలో తన గుహ ముందు కూర్చుని తత్వం పాడుకుంటున్న పులి తాతను

చూచింది. తరువాత అడవి నీలి కొండలు, చిట్టడవి దాటుకుని బంగారు ఉంటున్న మైదానం మీదికి వచ్చింది. గుడిసెముందు మంచాలు వేసుకుని బంగారు, అతని భార్య నిద్రపోతున్నారు. కొట్టంలో ఆవులు నెమరు వేస్తున్నాయి. కుక్కలు నాలుగూ కంటి మీద రెప్పవేయకుండా కాపలా కాస్తున్నవి.

బంగారు గుడిసె మీదికి ఒక చిట్టెలుక నడయాడుతూ వచ్చింది. అంతవరకు ఎక్కడ పొంచివున్నాయో — రెండు పిల్లులు హఠాత్తుగా దాని మీదికి దుమికాయి. ఎలుక భయంతో కీచు కీచుమంటూ ఇంటి కప్పు మీదినుంచి క్రిందికి దూకింది. పిల్లులు కూడా దాని వెనుకనే క్రిందికి లంఘించాయి. ఇంతలో కుక్కలు భౌభౌ మంటూ పిల్లుల్ని అటకాయించాయి. పిల్లులు రెండూ పరుకెత్తుకెళ్ళి దగ్గరలోవున్న చెట్టుపై కెక్కాయి.

ప్రాణభయంతో హడలి పోయిన ఎలుక వారీతెన్నూ లేకుండా ఎక్కడికో పరుగెత్తి పోసాగింది. గ్రద్ద ఆకాశం లోనే వాన్ని అనుసరించింది. బంగారు గుడిసె క్రమంగా కను మరుగై పోయింది. ఎలుక నీలి కొండల దగ్గరికి వచ్చింది. ఒక కొండ బొరియలో దూరబోతున్నది. గ్రద్ద ఇక ఆలస్యం చేయకుండా రివ్వున వచ్చి ఆ ఎలుకను తన్నుకొని పైకి వెళ్ళి పోయింది. బూరుగు చెట్టుకూచ్చుని దాన్ని పూర్తిగా తినేసింది. కడుపు ఇంకా కొంత వెలితిగానే ఉంది. అది మళ్లీ ఆకాశంలోకి ఎగిరింది. నక్కబావ నివసించే కనుమ వైపుగా పోసాగింది. పోతూ పోతూ వాగు గట్టున బెకబెక లాడుతున్న డప్పుల దొర కప్పను ఆరగించి కడుపు పూర్తిగా నింపుకొంది. కనుమలోకి వచ్చింది.

అక్కడ గుంపుగా కూర్చొని నెమరు వేసుకుంటున్న ఐదు ఆవులను చూచి గ్రద్ద ఆశ్చర్యపడింది. ఆ కనుమలో అది ఎప్పుడూ పశువులను చూచి ఉండలేదు. ఈ నడిరేయి పూట ఇక్కడ ఈ పశువు లెందుకున్నాయి?.... అనుకున్నది.

ఆవులున్న చోటికి కొంత దూరంలో నక్కను చూచింది గ్రద్ద. నక్క అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లిలా నడుస్తున్నది. ఒక దేవదారు పొదలో రెండు పూరేళ్ళు నిద్రపోతున్నాయి. నక్క వాటిని లటుక్కున పట్టుకున్నది. కటకటా నమిలేసింది.

నక్క చాతుర్యం చూచి, ఆకాశంలోని గ్రద్ద వికవికా నవ్వింది. ఈ నవ్వు విని నక్క తలెత్తి పైకి చూచింది "ఓహో! ఆకాశవాణిగారా! రండి రండి! దయచేయండి! తమ దర్శనం కోసమే కళ్ళుకాయలు చేసుకుని ఎదురు చూస్తున్నాను." అంటూ ఆహ్వానించింది. గ్రద్ద క్రిందికి దిగి వచ్చి — ఒక రాతి గుండు మీద కూర్చుంటూ "టక్కుటమారం గారికి కడుపు నిండిందన్న మాటేనా?" అని అడిగింది.

"ఆఁ! ఏమిటో లెండి పక్షీంద్రుడుగారు! మాంసాహారం మానేసినప్పటినుంచి ఆవుపాలతో గడపడం కొంత కష్టంగానే ఉంది. అయినా, క్రమంగా అదే అలవాటై పోయింది లెండి." అంది నక్క.

"అయినా మీరు పూరేళ్ళను తినొచ్చులెండీ జంబుకోత్తం గారూ! వాటిని శాకాహారం అనేస్తే సరిపోతుంది!" అంటూ వెకిలిగా నవ్వింది గ్రద్ద.

నక్క పులికి పడింది. "ఉస్! ఊరుకోవయ్యా మహానుభావా! కొంపదీసి ఆ ఆవులు వినబోతాయి. అటు దూరంగా వెళ్ళిమాట్లాడుకుందాం — పద అంటూ గ్రద్దను లేవదీసింది.

తమ మాటలు ఆవులకు వినిపించనంత దూరంగా వెళ్ళి కూర్చున్నాయి అవి రెండూ.

"సరేగానీ, ఈ గోసంపదను ఎక్కడిది సంపాదించావు మిత్రమా?" అని అడిగింది గ్రద్ద.

"వేరేగా సంపాదించాలా? ఇది నాకు రావలసిన వాటానేగదా?....బంగారం ఎవరో తెలుసా? ఆయన నాకు సొంతం అన్న. ఈ అయిదు ఆవులూ నా భాగానికి వచ్చాయి." అంది నక్క.

"అయితే — పంచభక్ష్య పరమాన్నాలను ముగించుకొని కూర్చున్న అజీర్ణ రోగిలా ఇంకావూరుకున్నావా?....వీటిని సద్వినియోగం - చేసుకోరాదా? .... నెలరోజులదాకా ఏ బెంగా ఉండదు కదా?" అంటూ గ్రద్ద పరిహాసించింది.

"ఏం చెయ్యమన్నావు నేస్తం? ఆవుకంటే నేను బలహీనుణ్ణి కదా ? .... ఆవునుండి ఆ జీవుణ్ణి వేరుచేసే శక్తి నాకు ఎక్కడిది? .... అయినా, వేరే దారి లేనేలేదు. నువ్వు ఒకచిన్న సాయం చేసి పెట్టాలి!"

"ఏమిటా సాయం?" అని అడిగింది గ్రద్ద. "ఏమీ లేదు.... పులిరాజు ఇప్పుడు క్షేమమే కదా?"

"వారి క్షేమానికి వచ్చిన లోపమేమీ లేదు."

"ఇప్పుడు వారి ప్రవర్తన చాలా మారిపోయిందని వినికిడి?"

"అవును! ఇప్పుడు వారు రెండో బంగారు!"

"అయినా ఫరవాలేదు. నా విషయంలో వారు తప్పక సహాయం చేయగలడన్న నమ్మకం నాకుంది." అంది నక్క.

"ఔనౌను! అందులో కించిత్తైనా సందేహం లేదు. పరోపకారం కంటే ఇంకొక పరమార్థం వారికి లేదు. నీకు వారు తప్పక సహాయం చెయ్యగలరు.' అంటూ భరోసా ఇచ్చింది గ్రద్ద.

"అయితే నేస్తం! పులిరాజు దగ్గరకుపోదాం. నీవు చేయవలసిన పనల్లా నన్ను వారికి ఘనంగా పరిచయం చెయ్యడమే! నీ సహాయానికి ప్రతిఫలం ఉండక పోదు. అయిదు రోజులుగా ఈ అవుల్ని చూచుకుంటూ నోరు చప్పరించుకుంటూ వున్నాను. ఇంతకంటే యాతన మరొకటి ఉండదేమో? ఇప్పుడే వెళ్ళి రాజావారి దర్శనం చేసుకుందాం పద!"అంటూ నక్క తన ఆవేదనంతా ఒలకబోసింది.

"నీకు సహాయం చేయడానికి నేను ఎల్లవేళలా సంసిద్ధంగా ఉన్నాను. బయలుదేరు!" అంటూ గ్రద్ద ఆకాశంలోకి ఎగిరింది. "గోమాతలారా! నేను తిరిగి వచ్చేవరకు ఇక్కడే ఉండండి" అని నక్క బిగ్గరగా కేకవేసి ముందుకు నడిచింది. పైన గ్రద్ద, క్రింద నక్క పులిరాజు గుహ వైపుగా సాగిపోయాయి.




## 6

"లేరా జీవా రారా జీవా
లేచి నిజము గనరా!
ముక్తికి మార్గం కావాలంటే
గురుని మాట వినరా!
బ్రతుకంతా ఒక బొమ్మలాట – ఇది
మిథ్యా లోకమురా
సత్యమైనదీ, నిత్యమైనదీ
ముక్తి ఫలమ్మేరా –
జీవనమంతా నిద్రే అయితే
జాగృతి ఎప్పుడురా?
మిథ్యలోన బడిపోతే – ముక్తిని

పొందే దెప్పుడురా?

లేరా జీవా! రారా జీవా!

లేచి నిజము గనరా!

ముక్తికి మార్గం కావాలంటె

గురుని మాట వినరా!"

ఆ రాత్రిపూట గుహ ముందర కూర్చుని తంబూరా మీటుతూ పులిబ్రహ్మంగారు పాడుతున్న పాట ఇది. అది తత్వం పాడుతూ ఆశగా అటూ ఇటూ చూస్తున్నది. ఎవరైనా ముక్తికి మార్గం చెప్పమని వస్తారేమో, చెప్పి పుణ్యం గట్టుకుందామని తహతహలాడిపోతున్నది. అయితే అంత రాత్రిపూట జీవరాసులన్నీ నిద్ర పోతున్నాయేమో— ఏదీ రాలేదు. అయినా పులి రాజేమో వాటిని నిద్ర లెమ్మంటున్నది. లేచి రమ్మంటున్నది. ముక్తిమార్గం చెబుతానంటున్నది. ఏ జీవుడూ రాలేదు. అది వాటి పాపమో, లేక పులిరాజు పాపమో!

....సరిగ్గా మూడు రోజుల క్రిందట ఇదే తత్వం పాడుతున్నది పులి. అప్పుడొక కణితి దాని దగ్గరకు వచ్చి "ఏదీ, ముక్తిమార్గం నాకు ఉపదేశిస్తావా?" అని అడిగింది.

"అంతకంటే పుణ్యమా? లోపలికిరా ఉపదేశిస్తాను!" అంటూ గుహలోపలికి పిలిచింది పులి. కణితిని కళ్ళుమూసుకోమన్నది. దేవుణ్ణి తలచుకోమన్నది. "నీకు ముక్తి కావాలంటే ఇంతకంటే దగ్గరదోవ ఇంకొకటి లేదు." అంటూ ఎగిరి దాని గొంతు పట్టుకొన్నది.

"ఆకటితి పుణ్యమా అంటూ ఈ మూడురోజులూ హాయిగా గడిచిపోయాయి. దానికి సద్గతులు ప్రాప్తించు గాక!" అనుకున్నది సర్వమంగళం. దానికిప్పుడు భరింప రాని ఆకలివేస్తున్నది. తంబూరా లోపల పడవేసి, అప్పటికే శుభ్రంగా చప్పరించి వేసిన ఎముకల్ని మళ్ళీ కొరికి చూచింది. అందులో కండ ఉంటేగదా?....దానికి ఆకలి ఎక్కువై పోతున్నది. .... .... మళ్ళీ గుహాద్వారంవద్దకు వచ్చినిలబడింది.

దూరంగా ఏదో జంతువు తన గుహవైపే పరుగిడి వస్తున్నది. భేష్! .... దాన్ని చమత్కారంగా గుహలోపలికి ఆహ్వానిస్తే చాలు—దానికి బ్రతుకు బరువు, తనకు ఆకలి బర్వు తగ్గిపోతాయి.

ఇంతలో—గ్రద్ద గుహముందరున్న పెద్ద బండమీద వాలి "పులిరాజుకు శుభము!" అన్నది.

"మిత్రుడా! కుశలమే కదా? .... ఆకలితో ప్రేగులు నకనక లాడిపోతున్నాయి.....ఆవచ్చే దెవరు?" అన్నదిపులి.

"ఆ సంగతి విన్నవించు కోడానికే నేను వచ్చాను. అతడు టక్కుటమార నామాంకితుడైన జంబుకోత్తముడు. నీ సహాయం పొందగోరి, నీ దర్శనార్థం వస్తున్నాడు. అతని యెడ ప్రసన్నుడవైతే అతని ద్వారా నీకు మంచి ఉపాధి ఏర్పడగలదు" అంది గ్రద్ద.

ఇంతలో టక్కుటమారం పులిరాజు ఎదుటకు వచ్చి వినయంగా నిలబడి "దేవరవారికి వందనశతము!" అంటూ అభివాదం చేసింద.

అతిథి దేవులు ఆసీనులు కావచ్చును. ఏ సీమవాసులు మీరు ? ఏమి పనిమీద ఇటువచ్చినారు." అని అడిగింది సర్వ మంగళం ప్రసన్న వచనంతో.

రాజోత్తమా! నన్ను టక్కుటమారం అని అంటారు. నేను బంగారుకు అనుంగు సోదరుడను. నీలి కొండల ప్రక్క నున్న కనుమ నా నివాసం." అని తన్ను తాను పరిచయం చేసుకుంది నక్క.

దాన్ని గూర్చి గ్రద్ద మరీ ఘనంగా పరిచయం చేసింది. "అంతేకాదు. ఇతడు గొప్ప ధనవంతుడు. ఇతని వద్ద కత్తి దెబ్బలకైన మొక్కబోని కండపుష్టిగల ఆవులు అయిదున్నాయి. ఒక్కొక్క ఆవు ఒక్క లక్ష అనుకుంటే — ఈ జంబుకేశ్వరుడు అయిదు లక్షలకు అధిపతి!"

పులి అత్యంతానుగ్రహంతో ఇలా అంది. "ఓహో! ఆనందం! బ్రహ్మానందం! ఇంతటి ఘన సంపన్నుని మైత్రి లభించినందుకు మాకెంతో సంతోషంగా ఉంది. ఇట్టి శుభ సమయంలో ఈతనికి రాజ బంధువు అన్న బిరుదమిచ్చి సత్క రించడం ఎంతైనా సముచితం!........"

"బాగు! బాగు! రాజావారి ఔదార్యం కడుంగడు ప్రశంసనీయం!" అంటూ గ్రద్ద తన రెక్కలతో చప్పట్లు చరిచింది.

"మహా ప్రసాదం!" అంది నక్క. "ఏలినవారి ఆదరాభిమానాలకు కృతజ్ఞుణ్ణి! .... ప్రభువులవారు నాకు మరొక్క ఉపకారం చేయాలి!"

. . "అవశ్యం సెలవియ్యి! పరోపకారార్థమిదం శరీరమ్ అని కదా పెద్దలన్నారు. తోడిసోదరులకు చేతనైన సహాయం చేయడం కంటే మించిన ఆదర్శం మరేమున్నది?...."

ప్రభువులవారికి అదేమంత గొప్ప కార్యంకాదు. నా వద్ద అయిదు ఆవులున్నాయి కదా? వాటి శరీరాలు వాటికి గాక నరులకు ఉపకరిస్తే – అది వాటికి శుభమేకదా?! కాని, వచ్చిన చిక్కేమిటంటే – ఆ శరీరాల మీద జీవాత్మ యొక్క అదుపు ఎక్కువగా ఉన్నది. చిన్న శరీరాలే అయితే ఇబ్బందిలేదు. కాని, ఇవి పెద్దశరీరాలు, కనుక ఆ జీవాత్మల కక్కడ స్థాన బలిమి ఎక్కువగా ఉంది. దేవరవారు నాకు ఈ విషయంలో తగిన సహాయం చేసిపెట్టాలని వేడుకుంటున్నాను. పాలను, నీటిని వేరుచేయగల శక్తి హంసకే ఉంది. జీవుణ్ణీ, శరీరాన్ని వేరుచేయగల శక్తి తమబోటి తపోధనులకే ఉంటుంది!"

సర్వమంగళం తన ముఖం మీద మోసులెత్తిన ఆనంద రేఖల్ని గాంభీర్యం చాటున దాచుకొంది. కొంతసేపు ఆలోచన అభినయించి, ఇలా అంది. "మిత్రమా!.... నా సహాయం కోరి ఇంత దూరం వచ్చిన వాడివి – నిన్ను నిరాశాపూరితుణ్ణి చేయడం నా అభిమతం కాదు. అందునా ఆడితప్పడం నా ఒంటిలోనే లేదు. సరే! నీవు కోరిన ఉపకారం ఇప్పుడు చేయమన్నా నా అభ్యంతర మేమీలేదు. అయితే, ఒక చేతితో చేసిన ఉపకారం రెండో చేతికైనా తెలియకూడదంటారు పెద్దలు. కనుకచేయవలసిన తతంగమంతా నా గుహలోపలే జరిగిపోవడం మంచిది."

"ఔనౌను! రాజావారి ఇష్టానుసారం చెయ్యడమే శ్రేయస్కరం." అన్నది గ్రద్ద.

"చిత్తం! ఒక్కక్షణం వ్యవధి ఇస్తే ఒక అవును వెంట బెట్టుకొస్తాను." అంటూ కనుమవైపు దూసుకు పోయింది నక్క. "జాగ్రత్త! ప్రచారం నా కిష్టంలేదు." అంటూ బిగ్గరగా కేక పెట్టింది పులి.

టక్కుటమారం కనుమలోకి వెళ్ళింది. ఒక అవును తన వెంట బెట్టుకొని వెనుదిరిగింది. ఇక ఇప్పుడది ఆనందంతో ఉబ్బి పోతున్నది. తన సమస్య పరిష్కారమై పోవడమే గాక, తనకు పులిరాజు స్నేహం కూడ లభించింది. తన పట్ల ఎంతో అనుగ్రహం చూపింది పులి. తనకు రాజబంధువు అన్న బిరుదాన్ని కూడ ప్రసాదించింది. గొప్పవారి అండ దండలుంటే అన్నీ ఉన్నట్లే!

దారిలో — కొమ్మనుండి కొమ్మకు పిల్లిమొగ్గలు వేస్తున్న చిట్టికోతి నక్కను చూచి "బావగారు అవులక్కతో కలిసి ఎక్కడికో ప్రయాణం కట్టారే?" అని అడిగింది. నక్క జవాబు చెప్పలేక తడబడింది. "పులిరాజుగారి ఆశ్రయానికి! రాజుగారు ముక్తిమార్గం సెలవిస్తారట. అదేమిటో అవులక్క కూడ విననీ!" అని జవాబిచ్చింది చివరికి.

అవి గుహను సమీపించాయి. గర్భగుడిలో దేవుడిలా పులి గుహలోపలికి వెళ్ళిపోయింది. "లోపలికి పద!" అంది నక్క అవుతో. అవు బెదురుతూ బెదురుతూ లోపలికి నడిచింది. పులి గబుక్కున దానిమీదికి దుమికి, నోటితో గొంతు పట్టుకుని

నెత్తురు గుటగుటా త్రాగేసింది. ఆవు బిగ్గరగా అరవడానికి ప్రయత్నించింది. కాని దాని గొంతు జీరబోయింది. కాళ్ళు విలవిల లాడించుకుంటూ నేలకొరిగి పోయింది.

పులికి, నక్కకు, గ్రద్దకు ఆ పూట పసందైన విందు. "ఆవు నెత్తురు, మాంసము ఇంత రుచిగా ఉంటాయని నాకు ఇంతవరకు తెలియదు సుమా ?" అంటూ పులి మీసాలు దువ్వుకొంది. అది ఆవును చంపి తినడం ఇదే మొదటిసారి. నక్కకు తాను చేసిన ఉపకారాన్ని గురించి దండోరా వేయవద్దని అది గ్రద్దను మరోసారి హెచ్చరించింది.

తూరుపు తెలతెలవారుతున్నది.

ఆ సూర్యోదయం ఆ మిత్రత్రయానికి ఎంతో ఉల్లాసాన్ని కలిగించింది. భవిష్యత్తులో వాటికి రక్తపు కాలువలు మాంసపు గుట్టలు కనిపిస్తున్నాయి.



7

రాజబంధువు టక్కుటమారం పులిరాజు గుహకు పోతున్నాడు. పులితో అతడికి గాఢ స్నేహం ఏర్పడింది. అతడు ఇప్పుడు దేవరవారికి మిక్కిలి ఆప్తుడు. అత్యంత సన్నిహితుడు. వారి కొక ఉపప్రాణం .... .... అంతా తన అదృష్టం అని మురిసి పోతున్నది నక్క.

గుహను సమీపిస్తుండగా — "దండాలండోయ్ పొట్టి నక్క గారూ!" అంటూ కిచకిచ లాడింది చిట్టికోతి. నక్కకు కోప మొచ్చింది. "ఎవడురావాడు? వోహో పిల్లకోతివా? మంచీ మర్యాదా లేదూ?.... పెద్దా చిన్నా లేదూ?.... వేలెడంత లేవు- రాజావారికి మిక్కిలి ప్రీతిపాత్రుణ్ణి — నాతో వేళాకోళ మాడు తున్నావా? ఎన్ని గుండెలు! నా బిరుదం రాజబంధువని తెలీదూ?" అన్నది గుడ్లెర్రజేసి.

"రాజబంధువులు పొరబాటును మన్నించాలి!.... వాడుక ప్రకారం నోరు జారాను. ఏం రాచకార్య మండీ!— అట్లా పరుగులు దీస్తున్నారు?" అన్నది కోతి.

"రాచకార్యమే మరి! రాజావారు నాకోసం ఎదురు చూస్తుంటారు. వెళ్ళాలి!" అంటూ నక్క ముందుకు వెళ్ళ బోయింది.

"రాజబంధువులను ఒకమాట అడగాలని ఉంది. ఇటీవల తమరి ఆవులు ఎక్కడా కనిపించకపోయినా వాటి ఒంటి నిగ నిగలన్నీ తమ ఒంట్లోనే కనిపిస్తున్నాయి ...." అంది కోతి.

నక్క గతుక్కుమన్నది. "అబ్బో! రాజావారి తత్వా మృతంలో మునిగితే — ఎవరికైనా ఎందుకు తేజస్సురాదు?" అన్నది. తన ముఖంలోని తత్తరపాటు బయట పడకుండా ఎంతో జాగ్రత్తపడింది. "ఇక ఆవులమాట అంటావా? ........ బొందితో కైలాసం వెళ్ళాలని అవి గట్టిగా పట్టుబట్టాయి. పులి రాజు వాటి కోరిక కాదన లేకపోయాడు. ఈపాటికి అవి స్వర్గంలో భోగభాగ్యాలు అనుభవిస్తుంటాయి. ఎంత అదృష్టం! నీకూ బొందితో కైలాసం వెళ్ళాలనుందా?"

"ఇప్పుడుకాదు. ముందు తమరు వెళ్ళండి. తమరి వెనకే నేనూ వస్తాను" అన్నది చిట్టికోతి.

నక్క బదులు చెప్పలేకపోయింది.

నాకు కైలాసం వెళ్ళాలనుందికానీ ఈ బొంది అంటే మాత్రం పరమ అసహ్యం! అందుచేత జీవితాంతం పుణ్య కార్యాలుచేసి బొంది రాలిపోయిన తరువాతే వెళ్ళాలనుకుంటు న్నాను" అని నవ్వుచెప్పి, ముందుకు సాగింది.

గుహ ద్వారంవద్ద పులిరాజు ఎంతో ఆదరం ఒలక బోస్తూ ఎదురు వచ్చాడు. "రావోయ్ శిష్యా ఆరో అవు ఏదీ?"

"నా దగ్గర ఉండినవి అయిదు ఆవులే గురూ! మిగిలిన వన్నీ బంగారువద్ద ఉన్నాయి" అని విన్నవించుకొంది నక్క.

"శిష్యా! గోజన్మ ఎంత పవిత్రమైనది! ఆహా! వాటి రక్త మాంసాల రుచి తగిలి జన్మధన్యమై పోయింది. గోవంశం వర్ధిల్లాలి!" .... పులి లొట్టలు వేసింది.

"అయితే గురువుగారు గోవంశం క్షీణమై పోయిందను కుంటున్నారల్లేఉంది. బంగారువద్దవున్న గోవుల్ని లెక్కపెట్ట లేము."

"అందుకు మేము సంతోషిస్తున్నాము."

పులిరాజు కొంతసేపు దీర్ఘంగా ఆలోచించాడు.! చివరికి నక్కతో ఇలా అన్నాడు. "శిష్యా! ఇప్పుడే వెళ్ళి ఆకాశవాణి ఎక్కడున్నా వెంటనే ఇక్కడికి రమ్మని చెప్పు."

టక్కు టమారం బయటికి వచ్చింది. ఆకాశవాణికోసం వెదకవలసిన శ్రమ తప్పిపోయింది. అదే సమయములో ఆకాశవాణి ఆకాశవీధిలో వలయాలు తిరుగుతున్నది. నక్క పైకి చూస్తూ "ఆకాశవాణీ వోమారు ఇలా క్రిందికి దిగిరావాలి!" అంటూ గట్టిగా వూళపెట్టింది.

ఆకాశవాణి క్రిందికి దిగింది. "నిన్ను గురువుగారు ఎందుకో రమ్మంటున్నారు" అన్నది నక్క.

ఆకాశవాణి గుహ ముందరి రాతిమీద కూర్చుని "పులి రాజా! పిలిచావా?" అన్నది.

పులి బయటికి వచ్చి "ఔను! సాయంకాలం జంతువుల సమావేశం ఉన్నది. ఈ సంగతి రాజ్యమంతటా చాటింపు వేయించాలి" అన్నది.

ఆకాశవాణి అరణ్యమంతా తిరుగుతూ ఇలా చాటింపు వేసింది. "వినండహో! కారడవిలో నివసించే ప్రజలంతా వినండహో! నేటి సాయంకాలం రాజమందిరం ప్రాంగణం లోని ఆవరణంలో జంతువుల సమావేశం జరుగనున్నది. ఈ సమావేశంలో అతి ముఖ్యమైన విషయాలు చర్చించవలసి ఉన్నవి. కనుక పై సమావేశానికి హాజరు కావలసినదిగా కీకారణ్య రాజ్య సార్వభౌములు శ్రీ శ్రీ శ్రీ సర్వమంగళ వ్యాఘ్రములుంగారు ప్రతి ఒక్కరినీ ఆహ్వానిస్తున్నారహో!"

సాయంకాలమైంది.

పులిరాజు ఉంటున్న గుహ పేరే రాజమందిరం. ఆ రాజమందిరం ముందరున్న బయలులో అరణ్యప్రజలంతా ఇసుకవేస్తే రాలనట్టు గుమిగూడి ఉన్నది. చిట్టికోతి మాత్రం చిటారు కొమ్మపైకెక్కి కూర్చున్నది. రాజుగారు గుహ ముందరి దిబ్బమీద ఆసీనులయ్యారు.

పులిరాజు కనుసన్న చేయగా ఆకాశవాణి ప్రార్థనా గీతం ఆలపించింది.

"మము పాలింపుము దేవా
మము దీవింపగ రావా
సత్యముతో మా శ్వాస జరుగవలె
కరుణ రసమె మా డప్పు ఉచ్ఛ్వవలె

అహింసయే మా కన్నముగావలె
శాంతికి తనువులు బలియైపోవలె
మము దీవింపుము దేవా
మము పాలింపగ రావా! .... .... "

తరువాత పులిరాజు తనఉపన్యాసం ప్రారంభించాడు. "పవిత్రాత్మ స్వరూపులారా! మీకు నా నమోవాకములు! రాజు అని పిలువబడుచున్న ఈ ఆత్మ ప్రజలు అనబడు ఆత్మ లన్నిటినీ ఇక్కడ సమావేశ పరచుటకు కారణ మేమనగా .... "

ఇంతలో చెట్టుమీదున్న చిట్టికోతి బిగ్గరగా ఇలా అంది.

"ఈ వేదాంత భాష మా తల కెక్కదండోయ్! రాజా వారు చెప్పదలచుకొన్నదేదో వ్యావహారిక భాషలో చెబితే అహింసకు దోహదం చేసినవారు కాగలరు."

"ఎంత మాటెంత మాట! రాజధిక్కారం!" అంటూ హడావుడి చేసింది టక్కుటమారం.

"శాంతించాలి! అందరూ శాంతించాలి! ఇందులో ఆగ్రహింప దగిందేమున్నది? కోతుల కుర్రవాని పలుకులు సబబుగానే ఉన్నాయి. పిన్నవాడైనా అజ్ఞానుల సౌకర్యాన్ని అనుసరించి, మనసులో మాట బయట పెట్టినందుకు అతడు అభినందనీయుడు. అతని కోరిక ప్రకారం మిథ్యాభాషలోనే ఉపన్యాసం ప్రారంభిస్తున్నాము.

మన భూమి అనతికాలంలోనే పుణ్యభూమిగా పరిణ మించిందనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. నీతి, ధైర్యము, ధర్మము మన అడవిలో నాలుగుపాదాల నడు

స్తున్నాయన్న మాట నిజం. సత్యము, అహింస మనరక్తంలో జీర్ణించి పోయినవి. సత్యాహింసల వంటి కఠినదీక్ష మరొకటి ఉండబోదు. అయినా ఆ దీక్షతో మనం కృతకృత్యులం కాగలిగాము. ఇప్పుడు ఆ దీక్షద్వారా మనం పొందుతున్న ఆనందం అద్వితీయమైనది. సత్యము, అహింస ఆవుల రక్తమాంసాలలా రుచికరమైనవని తెలుసుకో గలిగాము ........"

చిటారుకొమ్మమీది చిట్టికోతి కిచకిచమంది "బాగు బాగు! రక్త మాంసాలు తప్ప రాజావారికి వేరే పోలికే దొరకలేదా? అయితే – సత్యాహింసలను, ఆవుల రక్త మాంసాలను సమానంగా ఆదరిస్తున్నారన్నమాట!"

నక్క భయం భయంగా పులిరాజు ముఖంలోకి చూచింది. పులిరాజు తెలివైనవాడు. "సోదరులారా! పెద్దల మాటలకు మీరు ఇలా తప్పుడు వాఖ్యానాలు చేయరాదు. నేను పూర్వాశ్రమంలో ఎన్నో గోవులను పొట్టను బెట్టుకున్నాను. వాటి రక్తం అమృతతుల్యం! మాంసం – దానికదే సాటి! అయితే-ఇప్పుడు నేను గోవులను తింటున్నానా? మాంసాహారమే ముట్టుకోవటంలేదే?! .... అయినా నాకిప్పుడు తృప్తిగానే ఉంది. ప్రతి క్షణమూ గోరక్తం చప్పరిస్తున్నట్లే, గోమాంసం నములుతున్నట్లేవుంది. అంటే ఏమన్నమాట? ఇదంతా సత్యాహింసల ప్రభావమేనని సోదరులు గ్రహించాలి. నీవు కోరుతున్న ఆనందాన్ని సత్యాహింసలలో పొందగలవు. మన రాజ్యంలో అందరికీ ఈ ఆనందం సంపూర్ణంగా ఉందన్న సంగతి ఇక వేరే చెప్పుకోవాలా? ........ మనం ఆచరిస్తున్న సిద్ధాంతాలన్నిటి ఫలితమే శాంతి! మన

హృదయాల్లో శాంతి పొంగిపోతున్నది! మన రాజ్యంలో శాంతి పొరలిపోతున్నది. ఈ సౌభాగ్యానికి చాలవరకు కారకు లెవరో సోదరులంతా ఒక్కసారి ఆలోచించాలి. నీలికొండల కావల పచ్చిక మైదానంలో గోవులకాచే బంగారును గురించి తెలియని ప్రాణి మన రాజ్యంలో లేనేలేదు. అతనిని గూర్చి మనకన్నీ తెలుసు. అయితే తెలియని దొక్కటే! అతని రూపు! మన రాజ్యంలో ఒకరిద్దరు తప్ప అతన్ని ఎవ్వరూ చూచి ఉండరు. అతనిని మన రాజ్యానికి ఆహ్వానించి సన్మానించాలని మన ప్రజలకందరికీ అతని దర్శనసౌభాగ్యం కలుగ జేయాలని నాకు ఉద్దేశం కలిగింది. అయినా నేను పేరుకు మాత్రమేకదా రాజును! ........ నిర్ణయం చేయవలసిన వారు ప్రజలు!" అంటూ తన ఉపన్యాసాన్ని ఒక కొలిక్కి తీసుకు వచ్చారు. రాజావారు.

సభాస్థలమంతా సభికుల పదతాళ ధ్వనులతోను, హర్షధ్వానాలతోను నిండిపోయింది. "రాజావారి సంకల్పం అమోఘం!" అంటూ జంతువులు ముక్తకంఠంతో తమ ఆమోదాన్ని తెలిపాయి.

కరిరాజు మాత్రం అంతటితో ఆగక, బంగారుకు శాంతిదూతఅన్న బిరుదాన్ని కూడ ఇవ్వాలని ప్రతిపాదించింది.

ఏనుగంతటి పెద్ద జంతువు మాటను రాజావారు త్రోసి పుచ్చలేకపోయారు. త్వరలో బంగారును ఆహ్వానించి, అతనికి శాంతిదూత అన్న బిరుదాన్నిచ్చి సత్కరించాలని ఏకగ్రీవంగా తీర్మానించ బడింది.

ఆకాశవాణి పాడిన మంగళగీతంతో సభ ముగిసింది.

45




## 8

మరునాటి మిట్ట మధ్యాహ్నం బంగారు సంగటితిని, మర్రిచెట్టు క్రింద తన నేస్తాలతో ఇష్టా గోష్ఠి మాట్లాడుకుంటుండగా — గ్రద్ద బాణంలా దూసుకువచ్చి అతని ముందు వాలింది.

"బంగారుకు శుభము! నీలికొండల అవలవున్న కారడవిని పరిపాలించే తత్వబ్రహ్మ, జంతుకులసోమ, ముక్తిప్రదాతాది బహు బిరుదాంకితులైన శ్రీ శ్రీ శ్రీ సర్వమంగళ వ్యాఘ్రులుంగారి బంటును నేను. నా నామము ఆకాశవాణి!

ప్రభుపులవారు తమ సందేశాన్ని నీకందజేయమని నన్ను నియమించగా వచ్చాను" అన్నది.

ఇది విని బంగారు "చాల సంతోషం! మీరాజుగారికి శుభమగుగాక! .... వారి సందేశ మేమిటో వినాలని నాకు కుతూహలంగా ఉంది" అన్నాడు.

"మా ప్రభువు — వారి మాటలుగా నీతో ఇలాచెప్ప మన్నాడు .... రత్నాకరునివలె సుగుణ సంపన్నుడు, కామ ధేనువువలె దయానిధి, సూర్యబింబము వలె తేజోమయుడు, పూర్ణచంద్రుని వలె శాంతమూర్తి అయిన శ్రీ శ్రీ శ్రీ బంగారు రాజుకు మా శుభాకాంక్షలు. మహాత్మా! సకల జీవరాసుల హృదయాలలో నీతి బీజాలునాటి, శాంతి వృక్షాన్ని శాఖోప శాఖలుగా విస్తరింపజేసిన తమ దివ్య మంగళ విగ్రహాన్ని తిలకించి కన్నుల పండుగ జేసుకోవాలని మా రాజ్యప్రజ కాంక్షిస్తున్నది. బంగారురాజుగారు! మా ఈహృదయపూర్వక మైన ఆహ్వానాన్ని అందుకొని మా సీమకు విచ్చేసి మమ్మ అనందింప జేయవలయునని ప్రార్థిస్తున్నాము. కొండంత దేవు నికికొండంత పత్రి సమర్పించుకోలేము గదా! మా సన్మానం చిన్నదే అయినా, దానినే కొండంతగా స్వీకరించ గలరని కూడ వేడుకుంటున్నాము. తమ అంగీకారాన్ని మా ఈ రాయబారి ద్వారా తెలియజేస్తే సన్మానానికి శుభదినం నిర్ణ యించుకోగలము. సెలవు. ఇట్లు — తమ ప్రియ మిత్రుడు పులిరాజశ్రీ సర్వమంగళ చక్రవర్తి."

"పులిరాజు శ్రీరంగనీతులు వల్లించడంలో మంచి పాండిత్యమే సంపాదించాడు. స్వామీ! ఇదేదో గూడుపుఠాణీ!" అన్నాయి కుక్కలు.

"తొందరపాటు తగదన్నానా? మీస్వభావం ఇక ఈ జన్మలో మారదేమో!" అంటూ కుక్కలనోళ్లు మూసి పెట్టాడు బంగారు.

"ఆకాశవాణీ! మీ ప్రభువుగారికి నామీదున్న అభిమానానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి! ఈ ఆహ్వానం నాకెంతో సంతోషం కలుగజేసిందనీ, అందుకు నేను సుముఖంగా ఉన్నాననీ రాజశ్రీ సర్వమంగళ చక్రవర్తితో చెప్పు!" అన్నాడు గ్రద్దతో.

ఆకాశవాణి సెలవు పుచ్చుకొని, క్షణంలో నీలికొండలు దాటి వెళ్ళిపోయింది. "స్వామీ! పులితో స్నేహం ప్రాణానికే ముప్పు! మీరు అక్కడికి వెళ్ళడం మంచిదికాదు. మా మాట వినండి!" అన్నాయి కుక్కలు.

"సరే అనేశాను. ఏమైనాకానీ - ఇక మాట తప్పను!" అన్నాడు బంగారు.

మూడోనాటి ఉదయం బంగారు దగ్గరికి ఒక ఏనుగు వచ్చింది. సాయంకాలంవరకు మేతమేసి తరువాత ఇంటికి వెళ్ళిపొమ్మని ఆవులకు చెప్పి బంగారు ఏనుగుపైకెక్కి కూర్చున్నాడు. ఏనుగు గట్టిగా ఘీంకరించి ముందుకు కదిలింది. దానివెంట కుక్కలు కూడ ప్రయాణమైనాయి. "మీరెందుకు? నేనొక్కణ్ణే వెళ్ళిరాగలనులెండి!" అంటూ బంగారు వాటిని వారించాడు. కాని అవి వినలేదు. "మమ్మల్ని చిత్రహింసలు పెట్టినా మేము వెనుదిరిగి పోము. నీతోనేవస్తాము" అన్నాయి.

నీలికొండల వాలులలో, లోయలలో దారి చేసుకుంటూ ఏనుగు, దాని ముందు వెనుకల, బంగారుకు అంగరక్షకుల్లా నాలుగు కుక్కలు కొండవిలోక ప్రయాణమైనాయి.

కొంత సేపటికి కారడవి చేరుకుని, బంగారు కోసం ఏర్పాటు చేయబడిన విడిదివద్ద ఆగింది ఏనుగు. పులి సంతోషంగా ఎదురువచ్చి అతన్ని ఆలింగనం చేసుకుని, చేయిపట్టుకుని విడిదిలోకి నడిపించుకుని వెళ్ళింది. పులిని చూడగానే కుక్కలు భయంతో ముడుచుకు పోయాయి. అయినా — బంగారు అంటే వాటికి ప్రాణంకంటే ఎక్కువ కాబట్టి, అతని రక్షణే వాటి ఆశయం కాబట్టి — లేని ధైర్య సాహసాలు తెచ్చుకున్నాయి.

విడిది చాల అందంగా, హాయి గొలిపేదిగా ఉంది. ఆకులతోను, వెదురు బద్దలతోను కోతులు ఎంతో శ్రమపడి నిర్మించిన పర్ణశాల అది. విడిదిలో బంగారుకు పక్కని విందు ఏర్పాటు చేసింది పులి. రకరకాల పండ్లు చవి చూశాడు బంగారు. తేనెటీగలు ప్రీతితో ప్రత్యేకంగా తనకోసం తయారు చేసి ఉంచిన తేనె త్రాగాడు. కొంతసేపు విశ్రమించి మార్గాయాసం తీర్చుకున్నాడు.

బంగారు రాకను ఆకాశవాణి అందరికీ దండోరావేసి తెలియచేసింది. ఏనుగు మళ్ళీ బంగారును తన మూపున కూర్చుండబెట్టుకుని అరణ్యమంతా పూరేగించింది. బంగారు వస్తాడన్న ఆనందంతో అడవిలో చెట్లన్నీ పూవులు పూశాయి. పూరేగుతూన్న బంగారుపైన అవి పూలవాన కురిపించాయి. అడవి పిట్టలు స్వాగత గీతాలు పాడాయి. జంతువులు నాట్యాలు చేశాయి.

ఒకునాటమారం సన్మానానికి చేయవలసిన ఏర్పాటులన్నీ చేసింది. అడవి నడుమ పెద్ద వేదిక నిర్మించబడింది. వేదకముందు చెట్ల కొమ్మలన్నీ దగ్గరకు జరిగి, పచ్చని

పందిరిలా కనిపిస్తూ సభాసదులకు గొడుగుపట్టాయి. గండు తుమ్మెదలు, సీతాకోక చిలుకలు పందిళ్ళపైన తోరణాల్లా బారులుదీరి కూర్చున్నాయి. సభాంగణం జంతువులతో కిట కిటలాడి పోతున్నది.

వూరేగింపు వేదికవద్దకు వచ్చి ఆగింది. పులిరాజు ముందుకు నడిచాడు. అతని వెనుకే బంగారు నడిచాడు.

"తత్వ బ్రహ్మ, జంతుకుల సోమ, ముక్తి ప్రదాతాది బహు బిరుదాంకిత శ్రీ శ్రీ శ్రీ సర్వమంగళం సార్వభౌమ! బహుపరాక్! బహుపరాక్! బహుపరాక్!"

"బహు నీతికోవిద, వేదాంతరత్న, శాంతిప్రదాత శ్రీ శ్రీ శ్రీ బంగారు రాజ! బహుపరాక్! బహుపరాక్! బహుపరాక్!"

.... అంటూ ఆకాశవాణి కైవారాలు పలికింది.

పులిరాజు, బంగారు ఇద్దరూ వేదికపై తమ తమ ఆసనాలను అలంకరించారు. టక్కుటమారం తన ఆసనం లోకి వెళ్ళి కూర్చుంటూ, ఆకాశవాణి తనకుకూడ కైవారాలు పలుకుతుందేమోనని ఆశపడింది. పాపం, దాని ఆశ నిరాశ అయింది.

రెండు ఏనుగు గున్నలు వేదికకు చెరొక వైపున నిలబడి, బంగారు మెడలోన్ను, పులిరాజు మెడలోన్ను తామర పువ్వుల మాలలు వేశాయి. సభ చప్పట్లతో నిండిపోయింది.

ఆకాశవాణి ప్రార్థన చేసింది.

నక్క బంగారును సభికులకు పరిచయం చేసింది. "సోదరులారా! మన బంగారును గురించి మీ కందరికి తెలుసు. ఈ నాడు సుదినం! ఇతని శాంతాకారాన్ని ఈ నాడు వీక్షించగలిగారు మీరు. మీలో చాలామందికి తెలియని విషయం ఒక్కటేవుంది. ఈ బంగారు నాకు స్వయానా అన్న! భగవంతుడు ఇతనికి ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి బ్రోవవలెగాక!"

తరువాత పులిరాజు ఒక గంటసేపు బంగారును పొగడి సన్మాన వాక్యాలు పలికి, చిట్టచివర "ఇట్టి సుజన శీలికి శాంతిదూత అన్న మా బిరుదం చంద్రుని కొక నూలుపోగే కాగలదు" అన్నాడు.

పిదప బంగారు ఉపన్యసించవలసి వచ్చింది. అతడు తన ఉపన్యాసంలో నీతులన్నీ జొప్పించాడు. తనకు జరిగిన ఆ సన్మానానికి కృతజ్ఞత తెలియజేశాడు. అరణ్యవాసులను చూస్తూవుంటే తనకెంతో సంతోషంగా ఉందని, వారి ప్రవర్తన ఆదర్శప్రాయంగా ఉందనీ, పులిరాజు, అతని ప్రజలు శాంతి సాధనలో ప్రపంచానికే మార్గదర్శకులు కావాలని కోరుతున్నాననీ అన్నాడు.

అటుపిదప ఏనుగు, దుప్పి, కుందేలు మొదలైనవన్నీ ఉపన్యసించాయి. అవి అన్నీ బంగారును చూడగలిగినందుకు తమ జన్మలు సార్థకమై పోయినవన్నాయి. తమ రాజ్యంలో నెలకొన్న ఐకమత్యము, సంఘీభావము, పరస్పర సహకారము, సోదరభావము, శాంతి మొదలైనవన్నీ బంగారు నీతుల ఫలితమే నన్నాయి.

వినోద ప్రదర్శనలు, నాట్యాలు జరిగాయి. చిట్టి కోతి నర్తకివేషం వేసుకుని నాట్యంచేసింది. బంగారు, పులి, సభికులు చాల ఆనందించారు. "రాజావారు తమ తత్వ సుధారసం ద్వారా మాకు వీనుల విందుచేయాలని కోరుతున్నాను" అన్నది చిట్టికోతి.

పులి తంబూరా శ్రుతి సరిచేసుకుంది.

దానికి బంగారును చూచినప్పటినుంచి నోరూరుతున్నది. బంగారు ఒళ్ళు ఘుమఘుమలాడుతూ పులికి చవులూరిస్తున్నది. పులి వివేకం కోల్పోయింది.

"నరజన్మ మిక దుర్లభమురా
అవకాశమున్నపుడే అది పొందవలెరా
నరజన్మ మిక దుర్లభమురా! ........"

పులితోబాటు టక్కుటమారం కూడ తత్వం అందుకొన్నది.

"సత్యాము సద్గురుని మాట —
అది పొందగలిగితే మిగత సున్నంటా
సత్యాము సద్గురుని మాటా ....

పులి ఆలోచించింది. ఓహో! నక్క తనను వారిస్తున్నది! ఎందుకు? .... ఇప్పుడేమో తాను బంగారును మింగివేయవచ్చు. తరువాత తన బండారం బయట పడి పోతుంది. సులభంగా నోటికివచ్చే కబళంకోసం చాల శ్రమ పడవలసి వస్తుంది.

.... అయితే మాత్రమేం? ఈ నరవాసన ఎంత మజాగా ఉంది! .... మళ్లీ తత్వం కొనసాగింది.

" నరజన్మ కడు ఉత్తమమురా
కోటి జన్మలపెట్టు నరజన్మమేరా
నరజన్మ కడు ఉత్తమమురా .... "
" సత్యాము సద్గురుని మాటా
కాకుంటె కుక్కాలు ఉంటాయా వెంట.

సత్యాము సద్గురుని మాట ........ " అంది నక్క.
.... ఓహో నక్క తన్ను హెచ్చరిస్తున్నది.

పులి కుక్కలవైపు వోరకంట చూచింది. అవి తోడేళ్లలా బలిసి ఉన్నాయి. తాను బంగారు ఒంటి పైన పంజా మోపితే – అవి తన్ను ప్రాణాలతో విడిచి పెడతాయా? .... కనుక తొందరపడటం ప్రమాదకరం. ఆ గీతేవుంటే నర జన్మను ఏనాటికైనా పొందవచ్చును.

" నరజన్మ మిక దుర్లభమురా
సాజన్మ సాకార సద్గురుని గనరా

నరజన్మ మిక దుర్లభమురా! .... " అంటూ తత్వాన్ని ముగించింది పులి. జంతువులన్నీ సెబాసన్నాయి.

టక్కుటమారం వందన సమర్పణ చేసింది. " మా ఆహ్వానాన్ని ఆదరించి, మా సన్మానాన్ని స్వీకరించి ఎల్లరినీ ఆనందింపజేసిన శాంతిదూత శ్రీ బంగారన్నకు సార్వభౌముల తరపున మా హృదయ పూర్వక ధన్యవాదాలు! " జంతువులు హర్షంతో చప్పట్లు చరిచాయి.

"ఇచ్చటికి విచ్చేసి, సన్మానాన్ని జయప్రదం చేసిన సభాసదులందరికి మా నమోవాకములు."

"ఈ సన్మానానికి కావలసిన ఏర్పాటులన్నీ చక్కగా నిర్వహించి, అన్ని హంగులూ కలుగజేసిన శ్రీ బంగారన్న అనుంగు సోదరుడు, రాజబంధు బిరుదాంకితుడు శ్రీ టక్కుటమారామాత్యులవారికి మా కృతజ్ఞతాంజలులు!"

జంతువులన్నీ పకపకా నవ్వాయి. నక్కముఖం చిన్నబోయింది.

సభ ముగిసింది. అనంతరం బంగారు అరణ్యంలో కొన్ని ముఖ్యప్రాంతాలు సంపర్శించాడు. అతని కుక్కలు తోడునీడలా అతన్ని వెన్నంటి తిరిగాయి.

నక్క బంగారును చూచి చాల అసూయపడింది. అందరూ బంగారుకు బ్రహ్మరథం పట్టారు. శాంతిదూత అన్నారు. దేవుడన్నారు. తానేమో — బంగారు తమ్ముడనని ఎలుగెత్తి చాటుకున్నా తనకు గౌరవం చూపవు వెధవ జంతువులు! పైగా పరిహసిస్తాయి. తానంటే వీటి కెంత చులకన .... .... గొర్రెదాటు! ఆఖరికి ఆకాశవాణికి కూడ తానంటే నలుసులా కన్పిస్తున్నట్లుంది.

.... తన కిచ్చిన గోవుల్ని గూర్చి బంగారు ఎక్కడ అడుగుతాడో అని భయపడింది నక్క. అయితే బంగారు వాటి వూసెత్తలేదు.

పులి బంగారును తన గుహకు తీసుకుపోలేదు. ఆ గుహలో జంతువుల వెంట్రుకలు, ఎముకలు రాసులు

రాసులుగా ఉన్నాయికదా! .... అందుచేత మళ్లీ బంగారును అతని విడిదికి తీసుకుపోయింది.

పులిరాజు చూపిన ఆదరాభిమానాలకు బంగారు ముగ్ధుడై పోయాడు. పైగా అతని సుగుణాలు, నడవడీ, వేదాంత పరిజ్ఞానము బంగారును ఆకర్షించాయి. ఈ కొన్ని గంటల్లోనే పులిరాజుతో అతనికి గాఢ స్నేహం ఏర్పడింది.

"మిత్రమా! బంగారూ! మన ఈ గాఢమైత్రి కల కాలం వర్ధిల్లాలంటే ఏమి మార్గం?" అని అడిగింది పులి.

బంగారు కొంతసేపు ఆలోచించాడు. పులి కూడా ఆలోచించింది. "మన స్నేహం అవిచ్ఛిన్నంగా ఉండా లన్నా, మన ఉభయవర్గాలు క్షేమంగా ఉండాలన్నా — అందుకు మనం కొన్నిసూత్రాలను పాటించవలసి ఉంటుంది" అన్నాడు బంగారు.

తరువాత ఇరువురూ కలిసి ఈ క్రింది సూత్రాలను తయారు చేశారు.

ఒకరి ఐకమత్యానికి, స్వేచ్ఛకు మరొకరు భంగం కలిగించరాదు.

ఒకరి వస్తువులనుగాని, ఆస్తులనుగానీ అపహరించ రాదు.

ఒకరి వ్యక్తిగత విషయాలలో మరొకరు జోక్యం కల్పించుకోకూడదు.

ఏ పరిస్థితులలోను న్యాయం తప్పరాదు.

ఇరువురూ శాంతియుత సహజీవనం కోసం కృషి చేయాలి.

ఈ సూత్రాలకు శాంతి సూత్ర పంచకము అని పేరు పెట్టి, వాటిని ఇద్దరూ సంయుక్తంగా ప్రకటించారు.

ఆకాశవాణి ఈ శాంతి సూత్ర పంచకాన్ని కానల్లోను, కోనల్లోను చాటింది.

ఆ సాయంకాలమే బంగారు అందరివద్ద వీడ్కోలు పుచ్చుకొని ఏనుగుపై కూర్చుని తన కుక్కలు వెంటరాగా ఇంటికి బయలుదేరాడు. బయలు దేరుతూ — "మా ఆతిథ్యాన్ని కూడ పులి నేస్తం త్వరలోనే స్వీకరించవలసి ఉంటుంది" అన్నాడు.



# 9

మైదానానికీ, కారడవికీ, నడుమనున్న నీలికొండల మీద ఒక ఎత్తైన, విశాలమైన, భూమి ఉంది. ఆ పీఠ భూమిలో ఎప్పుడు చిక్కని పచ్చిక మొలిచి ఉంటుంది. నీటిబుగ్గలు పైకి చిమ్ముతూ ఉంటాయి. అక్కడ అందమైన జింకలు కొన్ని నివసిస్తున్నాయి. ఆజింకల దొర పేరు సుంద రాంగం.

సుందరాంగం, తక్కిన జింకలూ కూడా బంగారు భక్తులే! బంగారు అన్నా, అతని నీతులన్నా వాటి కెంతో ఇష్టం. అవి రోజూ మధురవాణి అనే చిలుక, శాంతి అనే పావురము చెప్పే కబుర్లను, దూరంగా ఎక్కడో మైదానంలోంచి సన్నగా వినవచ్చే వేణుగానాన్ని విని మైమరచి పోతుంటాయి. అయితే — అంత దూరం నుంచి అవి బంగారును మాత్రం స్పష్టంగా చూడలేక పోయేవి.

ఒక రోజు సుందరాంగం కడుపార మేసి, నీటిబుగ్గ ప్రక్కన పడుకుని ఉండగా — ఆకాశంలో కారడవి దిక్కుగా ఎగిరిపోతున్న పావురం కనిపించింది. సుందరాగం ఉత్సాహంతో పావురాన్ని నిలువరించింది. "ఒకసారి ఇటువచ్చి పోరాదటమ్మా శాంతీ! ఎక్కడికో ఆ పరుగు.

శాంతి వచ్చి సుందరాగం వీపున వాలింది. "తొందర పనిమీద వెళ్తున్నానయ్యా సుందరాగం! కారడవిని ఏలే సర్వమంగళ సార్వభౌములకు బంగారు వర్తమానం అందజేసి రావాలి." అన్నది.

"ఏమిటో ఆ వర్తమానం?"

నీకన్ని సంగతులు తెలిసే ఉంటాయికదా? .... సర్వమంగళంగారు బంగారు నీతి ప్రభావంచేత ఇప్పుడు నీకు మల్లేనే సాధువైపోయారు. కేవలం గాలి, నీటితోనే జీవిస్తున్నారు. వారు మన బంగారును వారి ప్రాంతాలకు ఆహ్వానించి సన్మానించడం, శాంతిదూత అన్న బిరుదాన్ని ఇవ్వడం, తరువాత విశ్వశాంతికి ఆధారభూతమైన శాంతి సూత్రావళిని సంయుక్తగా ప్రకటించడం మొదలైనవన్నీ జరిగాయి కదా! .... ఇప్పుడు బంగారు సర్వమంగళానికి ఆహ్వానం పంపుతున్నాడు." అన్నది శాంతి.

"మేలు మేలు! శాంతి విహంగానికి ఆ ఇరువురూ రెండు రెక్కల వంటివారు. ఇక వారి మీదే లోకకల్యాణం ఆధారపడి ఉంది" అన్నది సుందరాంగం.

శాంతికపోతం రెక్కలు టపటపలాడిస్తూ గాలిలోకి దూసుకు పోయింది.

ఆ మరుసటి రోజు పులిరాజు తంబూరా మీటుకుంటూ నీలికొండల మీది ఆ పీఠభూమికి వచ్చాడు. అకస్మాత్తుగా ఆతని దర్శనం లభించినందుకు జింకలు సంతోషంతో ఉక్కిరి బిక్కిరై పోయాయి. "పులిరాజా! నీ వంటే మాకెంతో అభిమానమున్నా — నీకు ఆతిథ్య మివ్వలేని దురదృష్ట వంతులమైనాము మేము. అయ్యో! నీవు తినదగినదీ మేము అర్పించగలిగినదీ ఏమున్నది?" అంటూ విచారించింది సుందరాంగం.

సుందరాంగం మీద నిలిపిన చూపుల్ని మరల్చుకో లేక పోయింది పులి. "జింకల దొరా! ఇప్పటి కేమీ వద్దు. రెండు నీతులు, రెండు గ్రుక్కల నీరు మాత్రమే చాలు. సమయం వచ్చినప్పుడు — మీవద్ద ఉన్నదేదో నేను తీసుకోకా తప్పదు, మీరివ్వకా తప్పదు."

నీతులతో, నీటితో కడుపునింపుకో గలిగిన పులిరాజు మహిమకు జింకలు ఆశ్చర్యపోయాయి.

పులి వాటివద్ద సెలవు పుచ్చుకుంటూ — "జింకలదొరా! నేను ఇప్పుడు నా ప్రియమిత్రుడు బంగారు కోరిక మీద అతని ఆతిథ్యం స్వీకరించడానికి వెళ్తున్నాను. మళ్ళీ ఎప్పుడైనా మిమ్మల్ని చూడాలనిపించినప్పుడు తప్పక వస్తానుగా!'" అన్నది.

పులి నీలికొండలు దిగింది. చిట్టడవిదాటి మైదానం ప్రవేశించింది బంగారు దానికి ఎంతో ఘనంగా స్వాగత మిచ్చాడు. పులికి కళ్ళు తిరిగిపోయాయి. ఆహా ఎన్ని ఆవులు! ఎన్ని దూడలు! .... నీలికొండల మీద జింకలు, ఇక్కడ ఈ గోవులు! .... దేవుడు చల్లగా చూడాలి గానీ, తన శేష జీవితం తృప్తిగా, హాయిగా గడిచిపోదూ? ....

తన్ను చూచి కుక్కలెందుకో గుర్రుమన్నాయి. స్థాన బలం కాబోలు! పిల్లులు మాత్రం తన కళ్ళల్లోకి చూస్తూ మూతులు సాగదీసి నవ్వాయి.

బంగారు పులికి అవుపాలిచ్చాడు. ఇంటి నుండి ఫల హారం కూడ తెప్పించాడు. పులివద్దన్నది. నీతులు మాత్రమే చాలన్నది.




# 10

సర్వమంగం తన గుహలో పడుకుని నిద్రపోతున్నది. నిద్రలో దానికి కలవచ్చింది. నీలికొండల మీద జింకలూ. బంగారు మేపే ఆవులు గుంపులు గుంపులుగా వచ్చి తన గుహ ముందర నిలబడ్డాయి. "పులిరాజా!" అని పిలిచాయి. బారులు తీరి నిలబడి ఉన్న జింకలను, గోవులనుచూచి లొట్టలు వేసింది - పులి. "ముందు మమ్మల్ని తిను!" అన్నాయి జింకలు. "పులి రాజా! ముందు మమ్మల్ని చంపాలి!" అన్నాయి గోవులు. మేము ముందంటే మేము ముందంటూ అవి పోట్లాడుకో సాగాయి. "శాంతి! శాంతి! పోట్లాట తగదు!" అన్నది పులి బిగ్గరగా. "ఆగండి! మీ తగాదా న్యాయంగానే పరిష్క

రిస్తాను. తినటమన్నా, చంపటమన్నా ఇంచుమించు ఒక్కటే గదా! ఇద్దరికి మధ్యమార్గంగా ఒక పని చేస్తాను. గోవులారా! ముందు మిమ్మల్ని చంపుతాను. జింకలారా! ముందు మిమ్మల్ని తింటాను" అన్నది పులి. జింకలు, గోవులు జేజేలు కొట్టాయి. పులి గోవును చంపబోయింది ....

పాపం, పులికి మెలకువ వచ్చేసింది .... అయ్యోరాత! ఇదంతా ఒట్టి కలేనా? ....

బయట ఎవరో పిలుస్తున్నారు. జింకలూ, అవులూ కాదు గదా!?

"గురూ!" అని కేక వేసింది టక్కుటమారం బయటి నుంచి.

ఏమిటో — పోవోయ్ శిష్యా! సత్యాహింసల వంటి కలను వికలం చేసేశావు" అంటూ ఆవేదన వెలిబుచ్చింది పులి.

"అది కాదు గురూ! ముక్తికోసం ఒక జీవుడు ఇక్కడ తపించిపోతున్నాడు."

ఆనందంతో ఎగిరి గంతువేసింది పులి. తనకు మంచి శిష్యుడే దొరికాడు. టక్కుటమారం వల్ల తనకు లాభం, తన వల్ల దానికి లాభం! ఇది ఇద్దరికి లాభసాటి బేరం! .... ....

పులి బయటికి తొంగి చూచింది. నక్క వెనుక ఒక దుప్పిపిల్ల నిలబడి ఉంది. "లోపలికి రమ్మను" అంది పులి. నక్క దుప్పిపిల్లను లోపలికి నెట్టింది.

"నీకు ముక్తికావాలా ?'' అన్నది దుప్పితో.

దుప్పి బదులు పలుకలేదు.

"నిన్నె ! నీకు ముక్తి కావాలా ?"

దుప్పి ఉలకలేదు, పలుకలేదు.

"నీకు చెవుడా ఏమిటీ ?"

సందేహం లేదు. దానికి చెవుడే !

పులి దాన్ని దగ్గరకు రమ్మని సైగ చేసింది.

అది రాలేదు.

"శిష్యా! జీవుణ్ణి మరికాస్త లోపలికిపంపించు" అన్నది పులి నక్కతో. నక్క దుప్పిని ఇంకొంచెం లోపలికి నెట్టింది. దుప్పి ముందుకు పరుగెత్తి గుహ లోపలి గోడకు ముఖం గుద్దుకొని పడిపోయిందే ఏమిటీ! దీనికి కళ్ళు కూడా కనిపించవా!.... భలే! శిష్యుడు తెలివైనవాడు దీనికి కళ్ళు కూడా కనిపించవు.

పులి ఇప్పుడు "ముక్తిప్రదాత" అన్న పేరుతో చెలామణి అవుతున్నది. ముక్తి కోరి లోపలకు వెళ్ళిన వాళ్ళెవరూ మళ్ళీ కనిపించలేదు. అవి నేరుగా బొందితో కైలాసం వెళ్ళిపోయాయని అనుకున్నాయి అడవిలో జంతువులు.

గుహలో — దుప్పి బొందితో కైలాసానికి ప్రయాణమవుతుండగా — గుహ బయట కొన్ని అడుగుల దూరంలో ఒక చెట్టు కొమ్మమీద చిట్టికోతి కూర్చున్నది. దాని చుట్టూ మరికొన్ని కోతులు కూర్చున్నాయి. ఈ మధ్య పులిని అనుసరించడం ఒక సరదా అయిపోయింది చిట్టికోతికి. నక్క దుప్పిని

తీసుకురావడం కోతులు చూశాయి. పులి బయటికి తొంగి చూచినప్పుడు చిట్టికోతి కూడ గుబురుటాకుల్లో నుంచి అలాగే తొంగి చూచింది. "లోపలికి రమ్మను" అన్నది. "నీకు ముక్తి కావాలా ?" అన్నది అచ్చం పులిలాగానే. కోతులన్నీ నవ్వుకున్నాయి. ముక్తి ప్రసాదించడం ఏలాగో చిట్టికోతికి తెలియదు. అందుచేత ఆ ఆట అంతటితోనే ఆగిపోయింది.

గుహ ముందర కావలి ఉన్న నక్క చటుక్కున లోపలికి దూరింది. లోపల ఏం జరుగుతున్నదో చూడాలనుకున్నది కోతి. అది చెట్టు దిగుతుండగా — ఆకాశంలో గ్రద్ద కనిపించింది. ఈ గ్రద్ద కూడ పులిరాజుకు చాల అంతరంగికుడు. కనుక జాగ్రత్త అవసరం అనుకున్నది కోతి. చెట్లోంచి ఆకులు, రెమ్మలు త్రుంచి నెత్తిన పెట్టుకొన్నది. చిన్నగా గుహను సమీపించింది. ఊపిరి బిగబట్టి, లోపలికి, ఇంకా లోపలికి తొంగి చూచింది. ఆశ్చర్యంతో దానికళ్లు మిణుగురు పురుగుల్లా మెరిశాయి. భయంతో ఒళ్లు గగుర్పొడిచింది. అంతే! ఆకులు, రెమ్మలు అక్కడే పారవేసి ఒక్క పరుగున వెళ్ళి చెట్టెక్కి కూర్చుంది.

దాని గుండె దడ తగ్గడానికి చాలసేపు పట్టింది. తరువాత అది వూరుకున్నదా? లేదు! కాలి మ్రోడుబారిపోయిన వెదురు చెట్లవద్దకు వెళ్ళిఒళ్ళంతా బూడిద పూసుకుంది. నీళ్ళల్లో బొగ్గు అరగదీసి ఒంటి మీద చారలు గీచుకొంది. పులి వేషం బాగానే కుదిరింది దానికి. కోతి తమ్ముళ్ళ నందరినీ వెంట బెట్టుకొని గుహముందరి చెట్టు నెక్కింది. వీధి నాటకం ప్రారంభమైంది.

చిట్టికోతి : వెడలే పులిరాజు ఇదిగో
వెడలే ....
వెడలెను బెబ్బులి.
పుడమి వడంకగ
వెడలెను ....

కోతులు : బెబ్బులి

చిట్టి : పుడమి

కోతులు : వడంకగ

చిట్టి : వడివడి నడుగిడి
కడు వేగముతో

కోతులు : వెడలెను బెబ్బులి
పుడమివడంకగ
వడివడి నడుగిడి
కడు వేగముతో.

చిట్టి : చారల బెబ్బులి
సభాంగణమునకు

కోతులు : సభాంగణమునకు

చిట్టి : చిన్నెల చూపుచు
చెంగున గెంతుచు

కోతులు : వెడలే పులిరాజు
వెడలే .... .... ....

చారల బెబ్బులి
సభాంగణమునకు
చిన్నెల జూపుచు
చెంగున గెంతుచును వెడలే .... .... "

చిట్టికోతి ఎత్తైన కొమ్మమీద కూర్చున్నది. మిగిలిన కోతులు క్రింది కొమ్మమీద కూర్చున్నాయి.

చిట్టి : అఁ! శిష్యా! టక్కుటమారం! మనరాజ్యము లోని విశేషము లేమి? .... ....

ఒకకోతి పైకిలేచి చేతులు గట్టుకుని నిలబడింది. అది - టక్కుటమారం! .... ....

టక్కుటమారం! గురూ! ముక్తికోసం ఇక్కడ ఒక జీవుడు తపించిపోతున్నాడు.

పులి : అయితే – వెంటనే లోపలికి ప్రవేశపెట్టుము.

టక్కుటమారం కొమ్మమీద కూర్చున్న ఒక చిన్న కోతిని చేయి పట్టుకుని వెళ్ళి రాజుదగ్గర వదలి పెట్టింది.

పులి : జీవుడా! నీ పేరేమి ?

"నా పేరు కోతి!" అంది మూడో కోతి.

"నువ్విప్పుడు కోతివి కావు. నీది దుప్పి వేషం అంటూ వివరించింది చిట్టికోతి.

పులి : జీవుడా! నీ పేరేమి?

"నా పేరు దుప్పి!"

పులి : నీకేం కావాలి ?

దుప్పి : నాకు ముక్తి కావాలి.

పులి : అయితే కళ్ళు మూసుకో!

దుప్పి కళ్ళు మూసుకున్నది.

పులి : అంతే! ఇక ముక్తికి వెళ్ళిపోతావులే. కైలాసం లోకి వెళ్ళి కళ్ళు తెరిచిచూడు.

— అంటూ పులి రెండు చేతులతో దుప్పిగొంతు పట్టుకుంది. దుప్పి వేషం వేసిన కోతి చచ్చినట్లు కొమ్మమీద బోర్లగిలా పడుకొంది.

చిట్టికోతి దుప్పి నెత్తురు త్రాగుతున్నట్లు, మాంసం తింటున్నట్లు అభినయించింది. నక్క వేషం వేసిన కోతికూడా అలాగే చేసింది. తరువాత రెండూ కలిసి త్రేవుమన్నాయి.

పులి : శిష్యా! ఈ నాటికిక సభ చాలింతము.

"పులిరాజు కొలువుకిక సర్వామంగాళం!

చిట్టికోతి భాగోతానికి సర్వామంగాళం!." అని పాడి నాటకం ముగించాయి కోతులు.

చిట్టికోతి నాటకం జట్టు ఈ వీధి భాగోతాన్ని అడవిలో ప్రతిచోటా, మారుమూలల్లోనూ ప్రదర్శించి, జంతువుల మన్ననల్ని పొందింది. వాటి కళ్ళు తెరపించింది. వాటికీ, పులిరాజుకు మధ్య క్రమంగా అంతరం ఏర్పడిపోసాగినది. మునుపటి వలె ఇప్పుడు అవి నక్కనుగాని, పులిని గానీ

నమ్మటం లేదు. సర్వమంగళం, టక్కుటమారం ఇరువుతూ ఆహారం సంపాదించుకోవటానికి ఇడుములు పడవలసి వచ్చింది.

"శిష్యా! ఇంత గడ్డురోజులు దాపురిస్తాయని కలలో కూడ అనుకోలేదు" అన్నది పులి టక్కుటమారంతో.

"గురూ! రోజులు మారాయి! చిట్టికోతి అంటే ఏమో ననుకున్నాను. అది చాలా గడుసు పిండంలా ఉంది. మన తెరమరుగున నాటకమంతా అది తెరమీది కెక్కిస్తూ ఉన్నది. ఇక జంతువుల విశ్వాసాన్ని తిరిగి సంపాదించుకోవడం అసాధ్యం!" అంది టక్కుటమారం.

ఒకనాడు పులి కోతుల నాటకాన్ని ప్రత్యక్షంగా కూడ చూచింది. చిట్టికోతిపైన దానికి చాలకోపం వచ్చింది. అయినా, తన కోపాన్ని దిగమ్రింగుకొన్నది. అది చిట్టికోతిని అడవిలో నుండి బహిష్కరించింది. ఆ బహిష్కార శాసనాన్ని అకాశవాణి ఇలా చాటింపు వేసింది.

"కారడవిలో – శ్రీ శ్రీ శ్రీ సర్వమంగళ చక్రవర్తిగారి ఏలుబడిలో నున్న సర్వులకు ఇందుమూలముగా తెలియజేయడమేమనగా – ధర్మాలలో కెల్ల అహింస పరమ ధర్మం. అహింసయే మన సిద్ధాంతం. ఇటీవల కొన్నిరోజుల నుండి చిట్టికోతి అహింసకు వ్యతిరేకమూ, శాంతికి భంగకరమూ అయిన ప్రదర్శనలిస్తూ దేశద్రోహ నేరానికి పాల్పడింది. కనుక, ప్రజల శాంతి భద్రతలు, రాజ్య శ్రేయస్సుల దృష్ట్యా చిట్టికోతిని అడవిలో నుండి బహిష్కరించడం అవసరమైంది. ఈ శాసనాన్ని ఉల్లంఘించి చిట్టికోతి రాజ్యం వదలిపోక తన

విద్రోహ చర్యలను కొనసాగిస్తున్నా, ప్రజ లెవరైనా ఆ విద్రోహ చర్యలలో పాల్గొన్నా, లేక హాజరైనా — అట్టి వారు కఠినముగా శిక్షింపబడుదురు. అంతా ప్రజా క్షేమం కోసమే! ఇది రాజాజ్ఞ! ...."

పాపం! చిట్టికోతి రాజ్యం వదలి వెళ్ళిపోయింది.

అయినా గురుశిష్యులు మాత్రం జంతువుల అభిమానాన్ని మళ్ళీ సంపాదించుకోలేక పోయారు. తిండికి కరువు ఏర్పడింది. నాలుగైదు రోజులు కడుపుకు తిండిలేక, ప్రేగులు మలమల మాడిపోగా — ఇక బాహాటంగా వేటాడవలసిన అవసరం ఏర్పడింది.

అయినా, పులి తొందరపడక, దూరమాలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది. అడవిలోని జంతువులతో శత్రుత్వం కొని తెచ్చుకుంటే — సర్వం నాస్తి! తన ఆంతర్యం బట్టబయలై పోతుంది; నీలి కొండలపైన జింకలకు తనపట్ల ఉన్న సదభిప్రాయం చెరిగిపోతుంది. మైదానంలో నున్న బంగారు తనను దరిదాపులకైనా రానివ్వడు; జింకలను, గోవులను గురించి తాను కనిన కల కలగానే ఉండిపోతుంది.

కాబట్టి మంచిగానే ఇక్కడి నుంచి మకాం మార్చివేయడం ఉత్తమోత్తమం! తరువాత — నీలికొండల మీద జింకలు ఉండనే ఉన్నాయి. పనిలోపని — ఏదో ఒక నెపంతో బంగారును కయ్యాని కీడ్చి, అతని గోవుల్ని కాజేయవచ్చు.

పులి ఇలా ప్రకటించింది, "సోదరులారా! నా శక్తి వంచనలేక న్యాయాల్ని, ధర్మాన్ని అనుసరిస్తూ నేటిదాక

ఈ రాజ్య భారాన్ని వహించాను కాని, ఈ నాడు ఒక్కటే చింత నా మనస్సును పీడిస్తున్నది. నాకు చావైనా రాదు. ఈ పాపిని తేరిపార చూడడానికైనా మృత్యువు భయపడుతున్నది గాబోలు! చేయరాని పాపాలెన్నో చేశాను. తప్పు తెలుసుకున్నాను. చావుకోసం ఎదురు చూస్తూ కేవలం వాయు భక్షణతో, భగవన్నామ స్మరణతో జీవయాత్ర కొనసాగిస్తూ ఉండగా – పిడుగు పాటులా ఇన్ని అపనిందలా ?.... అందులోనూ – నా మంచితనాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకున్న మీరే నన్ను అనుమానించవలసిన దుర్గతి నాకు సంప్రాప్తమైనది గదా! అయ్యో! ఇక ఈ జపము లేల? తపములేల?.... ఈ శరీరమేల ? .... వెళ్ళిపోతున్నాను. నేను ఇక్కడ జీవించటం మీకు ఇష్టం లేనప్పుడు, మీకు ఇష్టంలేని పని నేను, చేయలేను. మీ ఇష్టమే నా ఇష్టం! మీ శ్రేయస్సే నా శ్రేయస్సు! .... ముమ్ముందు - మీరు నా నిజాయితీని గుర్తించి, మళ్ళీ మన మధ్య అనురాగబంధం ఏర్పడగల శుభదినం తప్పక వస్తుంది. ఆనాడు వచ్చి మళ్ళీ మీ దర్శనం చేసుకోగలను. సెలవు !" అంటూ కన్నీళ్ళతో సెలవు పుచ్చుకొన్నది పులి.

టక్కుటమారం మాత్రం జంతువులను దుమ్మెత్తి పోసింది. "ఛీ! మీవి గుండెలు కావు. రాతి బండలు! ఇంతటి సుగుణరాశికి, పుణ్యశీలికి, పరమ పవిత్రునికి ఘోరమైన కళంకాన్ని అంటగట్టారు. అతని కడుపుకాలితే మీకు పుట్టగతు లుండవు! మీరు సర్వనాశనమై పోతారు! .... .... వంశం లేకుండా పోతారు! ...." అంటూ శాపనార్థాలతో అదీ గురువుగార్ని అనుసరించింది.




# 11

అయ్యా సుందరాంగం! ఇదీ మా అడవిలోని పరిస్థితి! సోదరులంతా సర్వమంగళం గొంతులో మింగుడుపడిపోతున్నారు. యదార్థవాదీ లోకవిరోధి అన్నారుగదా! జరుగుతున్నపాపం కళ్ళతోచూచి, నోటితో చెప్పుకున్నందుకే నాకీశిక్ష!" అన్నది చిట్టికోతి.

అయ్యోపాపం! సోదరులకు ఎట్టి దుర్గతి వాటిల్లినది! ....'' అంది సుందరాంగం జాలిగా "అయినా, ఇంత అక్రమం జరగడం కూడా కద్దా ?" అంటూ అది ఆశ్చర్యాన్ని కూడ వెలిబుచ్చింది.

"ఎంత అమాయకుడవయ్యా సుందరాంగం నువ్వు! తెల్లనివన్నీ పాలేనా? .... మోసాలతో, వేషాలతో పొట్ట నింపుకుంటున్న ప్రాణులు లోకంలో ఎందరున్నారో నీకేం తెలుసు?"

"ఉండవచ్చు! కాని పులిరాజు ఇటువంటి వాడంటే మాత్రం నమ్మడం కష్టంగానే ఉంది. ఇంతకు మునుపొకసారి అతడు ఇక్కడికి వచ్చాడు. రెండు గుక్కల నీరుతప్ప తన కింకేమీ వద్దన్నాడు. మమ్మల్ని అరగించాలన్నా అతనికి అడ్డమేముంది? అంతటి సాధుపుంగవుడు ఇంత క్రూరుడెలా కాగలిగాడు?!" అన్నది సుందరాంగం.

ఇంతలో కొన్నిజింకలు బెదురుచూపులతో అక్కడికి పరుగెత్తుకవచ్చాయి. "ఘోరం ప్రభూ! మహా ఘోరం!" అంటూ వణుకుతున్న గొంతుకలతో హాహా కారాలు చేశాయి.

ఇంతవరకూ ఇటువంటి పదాలే విని ఎరుగని సుంద రాంగం ఈ కేకలువిని మిన్నువిరిగి మీద పడినట్లు అదిరి పడింది. "ఏమిటి? ఏమైంది?" అని అడిగింది.

జింకలు చెప్పాయి – "క్రిందలోయలో మేము పచ్చిక మేస్తున్నాము. పులిరాజు అతనితోబాటు ఒక నక్క మాదగ్గరికి వచ్చారు. పులిరాజుకు మేము తలలువంచి నమ స్కరించాము. "రాజావారు చాలా ఆకలితో ఉన్నారు. ఈ పూట వారికి ఎవరు ఆతిథ్యమిస్తారు." అని అడిగింది నక్కమమ్మల్ని. "నేనిస్తాను" అన్నాడు మాలో ఒకడు. ఇక మిగలినవారంతా వెళ్ళండి. మీ వంతు వచ్చినప్పుడు మీరాయిద్దురుగాని!" అంది నక్క, పులిరాజు గాంధ్రు

మంటూ ఎగిరి ఆ జింక గొంతు కొరికేశాడు. బ్రతుకు జీవుడా అంటూ మేము పారిపోయివచ్చేశాము."

"రామ రామ!" అంటూ చెవులుమూసుకుంది. సుంద రాంగం.

కోతికొండ అంచుకు వెళ్ళింది. క్రింది అడవివైపు ఉన్న లోయలోకి చూచింది. దూరంగా పొదలనడుమ — చచ్చి పోయిన జింకను ఆరగిస్తున్నది పులి. టక్కుటమారం దాని ఎంగిలి కూటికోసం కాచుకొని కూర్చుని ఉంది.

"సుందరాంగం! ఇలావచ్చిచూడు!" అంది కోతి.

సుందరాంగం కోతివద్దకువెళ్ళి, క్రింద లోయలోకి చూచి "రామరామ" అంటూ కళ్ళుమూసుకుంది.

"సుందరాంగం! సర్వమంగళం ఎంత సాధువో చూశావా? అతనికి రెండు గుక్కలనీరు తప్ప మరింకేమీవద్దు కదూ? ...." అంది చిట్టికోతి.

"వెర్రివాడా! .... నేను ఓమారు అలాకిందికి వెళ్ళి వస్తాను! మనంమళ్ళీ కలుసుకోవాలని వేయి దేవుళ్ళకు మొక్కుకో!" — అంటూ చెంగు చెంగున లోయలోకి పరు గెత్తింది. దొంగలాగావెళ్ళి పులికి సమీపంలోనున్న ఒక చెట్టు మీదికెక్కి, కొనకొమ్మలో కూర్చుంది.

"అన్నమయితే నేమిరా మరి
సున్నమయితే నేమిరా?
అందుకే ఈపాడు పొట్టకు
అన్నమే వేతామురా!

నెత్తురైతే నేమిరా మరి
నీరమైతేనేమిరా?
అందుకే ఈ పాడుపొట్టకు
నెత్తురే కావాలిరా!'" అంటూ పాట అందుకొంది

.... ఈ పాట విని, పులి చుట్టుప్రక్కల కలయజూస్తూ, "ఎవడురా వాడు?" అంది.

"గురో! ఎవరో ఎందుకవుతాడు? చిట్టికోతిగాడే!" అన్నది టక్కుటమారం.

"ఏమిట్రా కొంటెవెధవా! నువ్వు ఇక్కడికి దాపురించావా! .... నిన్నిక్కడే మాడ్చి మసిచేస్తాను చూసుకో" అందిపులి పట్టరాని కోపంతో.

"ఒరే సర్వమంగళంగారూ! నీ కోతలు నా దగ్గర కొయ్యకురా నా తండ్రీ! .... ఏమిటి – ఇలా దండయాత్రకు బయలు దేరావు? .... దేవరవారి మెట్టవేదాంతం వారిరాజ్యంలో పనిచేయడం లేదా? – అంది చిట్టికోతి.

"అయ్! నోర్మయ్!

"అయ్‌అన్నా, హోయ్‌అన్నా నీ పప్పులు మనదగ్గర ఉడకవురా భాయ్! .... వృధా కంఠశోష! నోర్మయ్! అంటూ కోతి వెక్కిరించింది.

దాన్ని చీల్చిపారెయ్యాలన్నంత ఆగ్రహావేశంతో పులి చెట్టుపై కెగిరె, అందుకోలేక వెల్లికిలా పడిపోయింది.

"ఒరే మహాప్రభూ! నీ జేజినాయన లేచిరావాలి!" అంది కోతి.

"పళ్ళు రాలకొడతాను కోతివెధవా!" అంటూ లోయ దద్దరిల్లేలా గాండ్రించింది పులి.

"నేనుతమరి కాళ్లు విరగ్గొడ్తానండి రాజావారూ!"

"గూబ గుయ్యిమనిపిస్తా!"

"నేను తమర్ని డొక్కలో తంతా!"

"కిందికిరా — నమిలేస్తా!"

"తమరు పైకి రండి! చప్పరించేస్తాను!"

"తన్నానంటే ఆమడదూరం వెళ్ళిపడతావు."

"ఏదీ — తన్నండి చూద్దాం!"

"నీకు ఆయువు మూడింది!"

"తమరికి చేటుగాలము దాపురించింది!"

.... ఈ వాగ్యుద్ధం అరగంటసేపు కొనసాగింది. ఆఖరికి పులి ఓడిపోయింది. అది పూర్తిగా అలసిపోయి నోరు మూసుకుంది. "ఒరే దేవరా! పాపం అలసిపోయావు గాని, కాసిని మంచినీళ్లు త్రాగి మెదలకుండా పడుకోరో మహాప్రభూ! ఒరే టక్కుటమారం! నీ తిండి దొంగలెత్తుకుపోరు గాని, మీ అయ్యగారికి కాస్త శైత్యోపచారాలు గావించవోయ్ ముందు .... అంది చిట్టికోతి.

తరువాత అది — "ఈనాటి రణరంగంలో చిట్టికోతి పులిగాణ్ణి, చిత్తుగా ఓడించేసిందోహోయ్! చిట్టికోతికి — జై!" అంటూ జై భేరి మ్రోగిస్తూ, చెట్లమీదుగా దూకుతూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఆకలి వేసినప్పుడల్లా పులి ఒక్కొక్క జింకను చంప సాగింది. అది తినగా మిగిలిన ఆహారంతో టక్కుటమారం బ్రతుకు రోజూ ఒకపండువులా ఉంది.

సర్వమంగళం క్రమంగా తన వేదాంతానికి తిలోద కాలు వదులుకుంటున్నది. నివురు గప్పిన నిప్పులా ఉండిన దాని స్వభావం కార్చిచ్చులా విజృంభించింది. తన నిజరూపం ఇంక బంగారుకు తెలియక తప్పదు. తెలిస్తే మాత్రమేం? .... తా మిరువురూ పాటించదగిన పంచసూత్రాలను తాను నిరాదరించినట్లు దాఖలాలేవీ? .... తాను అతని స్వేచ్ఛకు భంగం కలిగించలేదు. అతని వస్తువులు అపహరించడ మంటూ ఇంకా జరుగలేదు. అతని వ్యక్తిగత విషయాలలో జోక్యం కల్పించుకోలేదు. ఇక — న్యాయమా? తిండిలేకపోతే బ్రతుకులేదు. కనుక — తిండి సంపాదించుకోవడం న్యాయం కాకపోదు. ఇన్ని అనుకూలాల దృష్ట్యా — బంగారుతో తనకు ఏ పేచీలేదు.

ఒకనాడు సర్వమంగళం — సుందరాంగం సమక్షం లోనే ఒక జింకను చంపబోయింది. "పులి రాజా! ఇలా జీవహింస చేయడం అన్యాయం కాదా! పాపం కాదా!" అని అడిగింది సుందరాంగం ధైర్యంచేసి.

"మిత్రమా! న్యాయం అందరికీ ఒకటే! నీకు ఆకలి వేస్తే నువ్వేం చేస్తావు? .... గడ్డి తింటావు గదా? .... నాకు ఆకలైనప్పుడు నేనూ ఏదో ఒకగడ్డి కొరకాలి గదా? .... ఇది అన్యాయ మెందుకౌతుంది?.... ఇక — పాప మంటావా? .... మీరు ఇవ్వగలిగినదేదో ఈనాడు నేను పుచ్చుకుంటున్నాను. కనుక — ఆ పాప పుణ్యాలేవో మీకే!" అంటూ సర్వమంగళం జింక గొంతు దొరక బుచ్చుకుంది.

సుందరాంగం ఆ ఘోరం చూడలేక పారిపోయింది.

జింక కాళ్ళు కట్టెల్లా నిగుడుకున్నాయి. దాని ప్రాణం బొందిలో నుండి ఎగిరి పోయింది.

చెట్టుమీద కూర్చున్న చిట్టికోతి "ఎనభై నాలుగు!" అన్నది.

ఇప్పుడిప్పుడు దాన్ని మంచి చేసుకోవాలని శతవిధాల ప్రయత్నిస్తున్నది పులి. "ఏమిటోయ్ నేస్తం! నువ్వు అన్నిట్లోనూ ఆరితేరిన వాడిలాఉన్నావే! అంకెలు ఎంత వరకూ వచ్చునేమిటి?"

"నూటొక్కటి వరకే!" అంది కోతి.

"ఆటుతర్వాత నేర్చుకోలేదా?

"నేర్చుకోవలసిన అవసరం కనిపించలేదు."

"ఎందుకు"

"అయ్యో సర్వమంగళం గారూ! నేను లెక్కబెట్టు తున్నది ఏమిటనుకున్నారూ? తమరి పాపాలు! నూరు

దాకా పరవాలేదు. నూటొక్కటితో తమరిపాపం పండి పోతుంది. అందాకా లెక్కబెట్టుకోవానికి నూటొక్కటి వరకు చాలు!"

"పొగరుబోతా! అంతవరకూ నిన్ను లెక్కబెట్ట నిస్తానా చూచుకో? .... " అంది పులి కసిగా.

"అది కలలో మాటండోయ్! తమరు చచ్చిన తర్వాత తమరి ఎముకలు గూడా లెక్కబెడతాను నేను." అన్నది చిట్టికోతి.

మరొకరోజున - పచ్చికైనా మేయకుండా బయలులో దిగులుగా కూర్చున్నది సుందరాంగం. చిట్టికోతి దాని దగ్గరకు వచ్చి కూర్చుంది.

"ఏమిటయ్యా! జింకల దొరా। అలా ఉన్నావు?

సుందరాంగం కన్నీళ్ళు కారుస్తూ ఇలా అంది. "వేరే కారణమంటూ ఏముంది నేస్తం? మా జాతి క్షీణాన్ని తలచుకుంటే గుండె చెరువైపోతున్నది. పులిరాజుకు మేమేం అపకారం చేశాము? .... మా కష్టాలు గట్టెక్కే మార్గమే లేదా? .... "

"లేకేం? ఉంది! నేను చెప్పినట్లు చేస్తావా?"

"చెప్పు!"

"సర్వమంగళం చావాలి — అని నినాదం చెయ్యి ముందు."

"రా మ రా మ!" అంటూ చెవులు మూసుకొంది సుందరాంగం.

"నీ చచ్చు సిద్ధాంతాలంతా కట్టగట్టి గంగలో పారేయ్! సర్వమంగళంతో కపటస్నేహం అవలంబించు. సమయం చూచి నీ కొమ్ములతో దాని రెండు కళ్ళూ పొడిచెయ్యి. లేక పోతే — నువ్వుకూడా స్వాహా!"

"అయ్యో! జీవహింస మహా పాతకం కాదా?"

"అయ్యో రాంరాం! నేను చెప్పవలసింది చెప్పాను. దాని మీదట నీ ఇష్టం! నిజానికి మిమ్మల్ని పులి చంపడం లేదు. మిమ్మల్ని మీరే చంపుకుంటున్నారు." అన్నది కోతి.

ఇంతలో — పులి గాండ్రింపు వినబడింది.

"మిత్రమా! తలవ్రాతను ఎవరూ మార్చలేరు. చంపడమో, చావడమో — రెండిటిలో ఒకటే మార్గం!" అంటూ కోతి చెట్టెక్కింది.

.... చాల సేపటి నుండి పులి మేతకోసం వెదకుతున్నది. ఒక్క మృగం కూడ దాని కంట బడలేదు. ప్రాణభయంతో అవి ఎక్కడో తలలు దాచుకున్నాయి. సుందరాంగాన్ని చూచి బిగ్గరగా నవ్వింది సర్వమంగళం. "జింకల రేడా! ఈవేళ నీ వంతు! నీ మరణంపట్లం నా సంతాపం తెలియజేస్తున్నాను. నీ ఆత్మకు శాంతి కలుగుగాక!" అన్నది.

సుందరాంగం భయంతో కంపించి పోయింది.

"మృగరాజా! నన్ను కరుణించవా?.... ప్రాణ భిక్ష పెట్టవా?" అంటూ దీనంగా బ్రతిమాలుకొంది.

పులి అంతకంటే దీనంగా — "హరిణ రాజా! నన్ను కరుణించవా? నా ఆకలి తీర్చవా?" అంటూ సుందరాంగం మీదికి దూకబోయింది.

సుందరాంగానికి అంత సత్తువ ఎక్కడినుండీ వచ్చిందో — అది పులి బారినుండి తప్పించుకోడానికి బాణంలా పరుగెత్తి పోసాగింది. పులి దాన్ని వెంటాడింది.

సుందరాంగం నీలికొండలమీదినుంచి క్రిందికి పరుగులు పెట్టింది. చిట్టడివి చేరుకొంది. దాన్ని తరుముతూ వస్తున్న పులిని టక్కుటమారం ఆపి, "గురూ! అది బంగారు దగ్గరికి వెళ్ళుతున్నట్టుంది. తమరు వెనక్కు వచ్చేయడం మంచిది!" అంటూ హెచ్చరించింది.

"అయితే — మరీ మేతే!" అంటూ సుందరాంగాన్ని తరుమసాగింది సర్వమంగళం.



# 12

"బంగారూ! శరణు! శరణు!" అంటూ సుందరాంగం సుడిగాలిలా వచ్చి బంగారు పాదాలమీద పడిపోయింది.

బంగారు దాన్ని పైకి లేవనెత్తాడు. "భయంలే" దంటూ దాని వీపు నిమిరాడు. "అసలేం జరిగింది?" అని అడిగాడు.

"పులిరాజు తరుముకు వస్తున్నాడు! నా ప్రాణాలు రక్షించు ...." అన్నది సుందరాంగం, దాని గుండె ఇంకా వేగంగా కొట్టుకుంటూనే ఉంది.

"రొప్పుతూ వస్తున్న పులిని చూశాడు బంగారు. పులి జింకను సమీపించడానికి వీలులేకుండా — ఆవులన్నీ చుట్టూ చక్రాకారంలో నిలబడ్డాయి. తోకలు పైకెత్తి, తలలు ముందుకు వంచి, పులికి తమ వాడి కొమ్ముల్ని చూపాయి. కుక్కలు

నాలుగూ – అవసరమైతే పులిని అడ్డుకోడానికి సిద్ధపడ్డాయి. పులి దగ్గరికి వచ్చేసింది.

"మిత్రమా! కుశలమే గదా?.... నా కన్నులు గప్పి పారిపోతున్న ఈ జింకను పట్టుకున్నావు. నీకు నా కృతజ్ఞత!" అంటూ జింకను సమీపించబోయింది.

.... కుక్కలు భీకరంగా మొరిగాయి. అవులు ఖణే లున రంకెలు వేశాయి. "పులిరాజా! అగు!" అన్నాడు బంగారు.

"నీకు ఈ జింకను ఇవ్వబోవడంలేదు. ఇది ప్రాణ రక్షణ కోసం నన్ను శరణువేడింది. దీనికి అభయ మిచ్చాను. నేను నా ధర్మం తప్పను."

"బంగారూ! ఈ జింక నాది! నా వస్తువును నీవు అపహరిస్తున్నావు. ఇంత దౌర్జన్యం పనికిరాదు." అంది పులి

"పులిరాజా! నేను దౌర్జన్యం చేయడంలేదు. నీ సొత్తును అపహరించడంలేదు. నువ్వు ఈ జింక ప్రాణాలు తీయాలను కున్నావు. నేను దీనికి ప్రాణభిక్ష పెట్టాను. ఈ జింక నీదెట్లా అవుతుంది?"

"బంగారూ! ఇది నా వ్యక్తిగత విషయం! ఇందులో నీ జోక్యం అనవసరం. నా జింకను నాకిచ్చేయి."

"నీది మొండివాదం! నీ వ్యక్తిగత విషయాలలో నేను జోక్యం కల్పించుకుంటున్నానా? అన్యాయానికి బలికావ డానికి సిద్ధంగా ఉన్న ఈ జింక నా ఆశ్రయాన్ని కోరింది.

ఇక — అన్యాయం దానికి జరిగినా, నాకు జరిగినా ఒక్కటే! ....కనుక మన స్నేహానికి భంగం కలుగకుండా ఉండాలంటే ఈ జింక మాట మరచిపో!" అన్నాడు బంగారు.

"నా సొత్తు కాజేయడమే గాక — నన్ను తప్పులు బట్టుతున్నావా బంగారూ!.... సరే! ఈ జింకయొక్క మూల్యాన్ని ఏదో విధంగా రాబట్టుకో గలనులే!" అంటూ పులి నీలికొండల వైపు వెళ్ళిపోయింది.

సుందరాంగం ఆనందానికి అంతులేదు. అది కృతజ్ఞతా సూచకంగా బంగారు పాదాల ముందర కూర్చున్నది. పులిరాజు దుర్మార్గానికి చాలా జింకలు ఎలా బలై పోయినదీ - చెప్పింది. అంతలో అక్కడికి చిట్టికోతి వచ్చింది.

"ఏమిటయ్యా సుందరాంగం? బ్రతికే ఉన్నావా! నీపిక్కబలం నిన్ను కాపాడింది. అదృష్టవంతుడివి!"అన్నది.

"కాదు మిత్రమా! నా ప్రాణాలు కాపాడింది — బంగారు! నా కోసం ఇతడు పులితో కయ్యాన్ని కూడ తెచ్చుకున్నాడు. నిజంగా ఇతనికి నేను జీవితాంతం ఋణపడి ఉంటాను." అన్నది — సుందరాంగం.

"సర్వమంగళం వంటి దుష్టుడితో కయ్యం ఏ నాటికైనా ఏర్పడేదేలే! .... దాని చరిత్ర ఇంకా మన బంగారుకు తెలియనట్లున్నది .... " అంటూ చిట్టికోతి అన్నిసంగతులూ అతనికి చెప్పింది. టక్కుటమారం టక్కులు, అయిదు ఆవులూ కైలాసానికి చేరుకొన్న వైనమూ కూడా తెలిసింది.

"ఆఁ! వాటిని టక్కు టమారం చంపించిందా? అయ్యో!" అంటూ బంగారు విలపించాడు.

"ఆనాడు మేము ఏమన్నాము? ఆ జిత్తులమారి నక్క అనుకొన్నంత పనీ చేసేసింది. అది ఈసారి కనిపించాలి — మా తడాఖా చూపిస్తాం." అన్నాయి కుక్కలు రౌద్రావేశంతో.

"వూరుకోండూరుకోండి!" అన్నాడు బంగారు. "దాని జోలి మనకెందుకూ? దాని అవుల్ని అది ఏమైనా చేసుకుంటుంది. ఆ పాపం దానిదే! ....

ప్రొద్దు గ్రుంక పోతుండగా — అవులమందను తోలుకుని బంగారు ఇంటిముఖం పట్టాడు. సుందరాంగం, చిట్టికోతి కూడ అతన్ని అనుసరించాయి.

పారిపోయి వచ్చిన సుందరాంగానికి ఇప్పుడు బంగారు ఇల్లే ఆశ్రయమైంది. తనవారెలా ఉన్నారో అన్న విచారం తప్ప, దానికి మరోలోటు లేదు. దానికి అన్ని సదుపాయాలూ అమర్చి పెట్టాడు బంగారు. ఇలా రెండు రోజులు గడిచాయి.

మూడో రోజు ఎప్పటిలాగా బంగారు అవులమందను చిట్టడవిలోకి తోలుకు వెళ్ళాడు. అవులు మేస్తున్నాయి. కుక్కలు పరుగులెత్తి ఆడుకుంటున్నాయి. బంగారు కాస్సేపు పిల్లనగ్రోవి వూదాడు. చెట్టుక్రింది చల్లనినీడలో అతనికి తెలియకుండానే నిద్ర పట్టేసింది.

హఠాత్తుగా అతనికి మెలకువ వచ్చింది. అవులన్నీ భయపడిపోయి బిగ్గరగా రంకెలు వేస్తున్నాయి. కుక్కలు

తోకలు ముడుచుకుని ముందరికీ వెనక్కూ తిరుగుతూ మొరుగు తున్నాయి. ఏదో విపత్తు జరిగి ఉంటుందను కున్నాడు బంగారు. "ఏమిటి? ఎందుకిలా కంగారు పడి పోతున్నారు?" అని అడిగాడు.

"పులి! పులి వచ్చింది! ఒక ఆవుమీదికి విరుచుకుపడి చంపివేస్తూంది!" అన్నాయి కుక్కలు.

ఈ మాట వినగానే బంగారు తల దిమ్మెక్కిపోయింది. "ఏదీ? ఎక్కడ" అన్నాడు అతడు ఆత్రంగా.

"ఇంకా ఎక్కడుంది? చచ్చిన ఆవును ఎత్తుకుని వెళ్ళి పోతున్నది!"

పులి ఆవును చంపిన స్థలం చూశాడు బంగారు. అక్కడ చిన్నరక్తపు మడుగు ఏర్పడింది. అక్కడి నుండి పులి వెళ్ళిపోయిన దిక్కుగా రక్తపు మరకలు, పులి కాలి గుర్తులు కనిపిస్తున్నాయి.

ఈ ఘోరం చూచి బంగారు గుండె తరుక్కుపోయింది. అతడు గబగబా పులివెళ్ళిన వైపుగా కొంతదూరం వెళ్ళాడు. "ఓ పులిరాజా! నీకిది న్యాయంకాదు. నేను, నా ఆవులు నీకేం అపకారం చేశాము? ఇంత అక్రమమా? ఇంత దౌర్జన్యమా? అంటూ కేకలు పెట్టాడు.

పులి బదులు పలుకలేదు. దట్టంగా ఉన్న పొదలూ, చెట్ల చాటున అది కంటికైనా కనిపించ లేదు. దాన్ని కలుసుకోవాలని బంగారు పిచ్చివాడిలా పరుగు తీశాడు. చిట్టికోతి అతనికి ఎదురుపడి వారించింది. "బంగారూ! వెనక్కు

వెళ్ళిపోవాం రా! పులిదగ్గర నీ మంచితనం ఎందుకూ పనికిరాదు. అది నిన్ను చంపివేసినా చంపివేయవచ్చు! .... "

బంగారు బరువుగా అడుగులు వేసుకుంటూ మరలి వచ్చేశాడు. ఈ సంఘటన అతని హృదయాన్ని కలచి వేసింది. "ఈ పులి స్నేహమంతా వట్టి బూటకమేనా? దీని మాటలూ, చేతలూ అన్నీ బూటకమేనా? దీని మాయదారి వేషాలకు నేను సులభంగా మోసపోయానే! అయ్యో! శాంతి సూత్రాలను కూడ కాలదన్ని, అది ఇంతటి ద్రోహానికి పాల్పడిందే! నా గంగగోవును నిలువునా చంపివేసిందే!" అంటూ విలపించాడు.

రెండు రోజుల తర్వాత పులి మళ్ళీ ఆవుల మందలోకి జొరబడి ఇంకొక ఆవును చంపబోయింది. ఆ సమయంలో బంగారువద్ద కట్టెలు నరికే గొడ్డలి ఉంది. "స్వామీ! గొడ్డలి ఉంది కదా! పులి తలను తెగవేసెయి! వేగిరం!" అన్నాయి కుక్కలు. "ఔనయ్యా బంగారూ! ఆలస్యం పనికిరాదు. ఊఁ! కానీ!" అన్నది చిట్టికోతి. బంగారు గొడ్డలి బాగా పదునుగా ఉంది. దానితో ఒక్క దెబ్బ వేస్తే పులి తలకాయ దోసకాయలా ఎగిరిపోతుంది. అయితే బంగారు మాత్రం అలా చేయలేదు.

"పులిరాజా! అగు! నా ఆవును చంపకు! నాతో నెయ్యాన్ని కోరినవాడివి ఇప్పుడు కయ్యానికి దిగుతున్నావా? శాంతి సూత్రాలను పటాపంచలు చేస్తావా? .... దౌర్జన్యంగా నా గోవులను చంపి తినడం అన్యాయం కాదా? .... ?" అన్నాడు. అతని మాటలలో కోపంలేదు. వేదన ఉంది. వేడికోలు ఉంది.

పులి వినలేదు. "కల్లబొల్లి మాటలు చాలించవోయ్ బంగారూ! శాంతి సూత్ర పంచకానికి స్వస్తి చెప్పిన వాడివి నువ్వు. దౌర్జన్యంతో నా జింకను హస్తగతం చేసుకున్న వాడివి నువ్వు. నాతో కయ్యానికి కాలుదువ్విన వాడివి నువ్వు. అన్యాయమంతా నీదే! పైగా అన్యాయాన్ని నా మీద మోపుతున్నావు. నా జింకను నువ్వు కాజేశావు. అందుకు బదులుగా నీ ఆవులన్నీ నాకు చెందవలసి ఉంది. నీ ఆవుల్ని నేను తీసుకోవడం అన్యాయమా?....శాంతి శాంతి అని నీతులు వల్లిస్తూ, లోలోపల గోతులు త్రవ్వడం నీ బోటి మోసగాళ్ళకే చెల్లును" అంటూ అది అవును చంపి, నీలికొండల్లోకి ఎత్తుకుపోయింది.

"అయ్యో బంగారూ! మంత్రాలతో మామిడికాయలు రాల్తాయా? గుడ్డివాడిచేతికి దీపమూ, నీ చేతికి గొడ్డలి రెండూ ఒకటే!" అంది చిట్టికోతి.

చాలాకాలం తర్వాత -ఈ నాటికి – సర్వమంగళానికి, టక్కుటమారానికి ప్రతి పూట గోమాంసం కళ్ళజూచే భాగ్యం అబ్బింది. వాటికి ఇంత కంటే కావలసిందేమున్నది? సర్వమంగళం తినగలిగినంత తినగా మిగిలినది టక్కుటమారానికి. మొదటినుంచీ నక్కకు బంగారు గోవులపైనే కన్ను! ఆ తనివి తీరాలంటే పులితో పొత్తుకంటే మంచిదారిలేదు. పులిగారితో తనకు పొత్తూ కుదిరింది, వారి అనుగ్రహమూ లభించింది. ఇకనేం? తన కలలు ఫలించాయి. పులి ఒక్కొక్క గోవును చంపినప్పుడల్లా టక్కుటమారం "గురువు గారికీ జై!" అంటూ జేకొడుతుంది. గోమాంసంతో కడుపు నింపుకొన్న పిదప – "హమ్మయ్య! నా పొట్ట ఇప్పుడు చల్లగా ఉంది. నా పొట్ట వెయ్యేళ్ళు చల్లగా ఉండాలంటే –" అని మనసులో అను

కుంటూ – "గురువుగారు వెయ్యేళ్లు చల్లగా ఉండాలి?" అని బిగ్గరగా అంటుంది.

సర్వమంగళం సామాన్యమైనదా? ఆవలిస్తే ప్రేగులు లెక్కబెట్టే రకం అది. "శిష్యా! నీకు ఆ భయం లేదు. నీ పొట్ట వెయ్యేళ్ళు చల్లగా ఉంటుంది?" అంటూ అది శిష్యుణ్ణి దీవిస్తుంది.

తాము గోవుల్ని చంపుతున్నామనీ, తాము చేస్తున్నది పాపమనీ అవి అనుకోవు. అంతా పుణ్యకార్యమే అనుకుంటాయి. ఎట్లా అంటే – ఆవు శరీరావయవాలకు అవి కొన్ని పేర్లు పెట్టుకున్నాయి.

ఆవు రక్తం పేరు – భక్తిసుధ!
మెదడు – వేదాంతం.
గుండెకాయ – పరమాత్మ.
నాలుక – సత్యం.
కన్నులు – న్యాయం.
ప్రేగులు – తత్వం.
కండలు – తారకం.
క్రొవ్వు – బ్రహ్మం.
ఎముకలు – అహం.

....పులి "కృష్ణార్పణం" అంటూ ఆవు గొంతు పట్టుకొని భక్తిసుధ గ్రోలివేస్తుంది. కళేబరాన్ని నీలి కొండలలోనున్న ఒక చిన్న గుహలోకి మోసుకొస్తుంది. అక్కడ – వేదాంతం, పరమాత్మ మొదలైన వాటినంతా విడివిడిగా ఏరి పెడుతుంది. అన్నిటినీ రుచి చూస్తుంది.

"అహా! వేదాంతం ఎంత బాగుంది!"
"ఓహోహో! పరమాత్మ దివ్యంగా ఉంది!"
"భలే భలే! బ్రహ్మం బహు రుచికరం!"
"బాగు బాగు! సత్యం కడు మధురం!"
"వారెవ్వా! తారకం దిల్ పసందు!"

టక్కుటమారమేమో లొట్టలువేస్తూ చూస్తూ ఉంటుంది. చిట్టచివర దానికి దక్కేవి — కావలసినంత తారకం తత్వం, అహం! కడుపు చాకిబానంత అయ్యేవరకు నక్క తారకాన్నీ, తత్వాన్ని తింటుంది. .... ఈ విందు ముగిసిన తర్వాత అహం మాత్రం మిగిలి పోతుంది. "గురో! అహాన్ని వదలిన వాడే జ్ఞాని! కనుక వదలివేస్తాను...." అటుంది నక్క.

"తథాస్తు!" అంటుంది పులి.

పాపం — నక్కకు భక్తిసుధను గురించి, వేదాంతాన్ని గురించి, పరమాత్మను గురించి బొత్తిగా తెలియదు. గురువు గారు ఎప్పుడు కటాక్షిస్తారో?

సర్వమంగళం ఇప్పుడు చిన్న జంతువుల జోలికే పోవడంలేదు. కొండమీది జింకలను కూడ ఎక్కువగా వేటాడటం లేదు. సుందరాంగం చలువవల్ల రోజులు హాయిగానే గడిచిపోతున్నాయి .... సుందరాంగం బంగారును శరణు వేడింది. బంగారంతో స్నేహాన్ని తెగతెంపులు చేసుకోవడానికి, ఆవులను అపహరించడానికే మంచి నెపం దొరికింది! .... అంతా దైవకృప!



## 13

తనవంటి మెతకవాడికి ఇటువంటి ఆపద వచ్చి పడుతుందని – బంగారు ఏనాడూ అనుకోలేదు. ఎవరికీ ఏ అపకారము చేయలేదు. ధర్మం తప్పలేదు. మంచిని విడనాడలేదు. తనకా ఈ ఘోర విపత్తు!

సర్వమంగళానికి, బంగారుకు నలుపు తెలుపులకు ఉన్నంత తేడా ఉంది. రూపుదాల్చిన అధర్మం సర్వమంగళం. అది ధర్మాన్ని నిట్టనిలువుగా క్రమింగివేస్తుంది. బంగారు క్రుంగిపోయాడు. "ధర్మమే జయం" అని గుండె దిటవుపరచుకున్నాడు.

"మిత్రులారా! పులి నాగోవుల్ని చంపి తింటున్నది, ఇది ధర్మమేనా?" అని తన మిత్రులందరినీ అడిగాడు బంగారు. చిలుకలు, కోయిలలు, పావురాలు, నెమళ్ళు, కుందేళ్ళు, ఉడుతలన్నీ కూడా "అధర్మం" అన్నాయి. "అధర్మం నశించాలి!" అన్నాయి.

"అధర్మం నశించాలి అంటే ఎలా నశిస్తుంది? ఎలా నశింపజేయాలి!?" అన్నాయి కుక్కలు.

"మీ అభిప్రాయ మేమిటి?" అని అడిగాడు బంగారు— పిల్లుల్ని. "పులి ధర్మంతప్పితే ప్రపంచం మునిగిపోదూ? .... పులి గోవుల్ని తింటూఉండంటే అది ధర్మమే అయివుండాలి" అన్నాయి పిల్లులు.

కుక్కలు కస్సుమన్నాయి. "పులి మనకు ప్రత్యక్ష శత్రువైతే—ఈ పిల్లులు మనకు అనుకూల శత్రువులు! ఆవుపాలు గొంతుదాకా త్రాగి, ఆవులకే ద్రోహం తలపెడు తున్నాయి ఇవి. వీటికి కృతజ్ఞత, విశ్వాసం అనేవి అవ గింజంతైనా లేవు. నీతిమాలి జాత్యభిమానముతో పక్ష పాతం చూపుతున్నాయి ఇవి. శాంతికిపట్టిన పీడ వదలించు కోవాలంటే—సర్వమంగళాన్ని చంపడానికి ముందుగా ఈ పిల్లుల్ని, టక్కరినక్కను మట్టుబెట్టాలి .... ...." అన్నాయి.

"ఊరుకోండూరుకోండి! వాటి అభిప్రాయాల పైన మనకేమీ అధికారంలేదు. పక్షపాతం ఉన్నంత మాత్రాన అవి మనకు చేసే అపకారమేమీ లేదు." అన్నాడు బంగారు.

ఒకనాడు అతనికి చిట్టడవి చివర టక్కుటమారం కనిపించింది. "తమ్ముడూ! పులి నా గోవుల్ని చంపి తింటున్నది. ఇది ధర్మమంటావా" అని అడిగాడు.

"మీ గొడవలు నాకనవసరం! అయినా అడిగావు గనుక లోకాభిప్రాయాన్ని ఏమిటో చెప్పక తప్పదు. నాకు తెలిసినంతవరకు సర్వమంగళం సార్వభౌములవారు అపర ధర్మరాజు! .... సముద్రాలు ఇంకి పోవచ్చు, సూర్యుడు పడమటిదిక్కున పుట్టవచ్చు, ఆకాశం బ్రద్దలు కావచ్చు, కాని .... సర్వమంగళంగారు ధర్మం తప్పడం మాత్రం జరుగదు. అటువంటివారు నీ గోవుల్ని చంపుతున్నారంటే – అధర్మానికి నువ్వే పాలుపడి ఉండాలి. పులిరాజువారు వారి ధర్మాన్ని కాపాడుకోవడానికి నీ గోవుల్ని చంపుతూండాలి." అన్నది టక్కుటమారం.

చెట్టుమీద నక్కివున్న చిట్టికోతి కూడా ఈ మాటలు విన్నది. 'అయ్యో బంగారూ! టక్కుటమారమే సర్వమంగళం, సర్వమంగళమే టక్కుటమారం! కనుక వారుచేసే ప్రతిపనీ ధర్మబద్ధమైనదేనంటారు వీరు. అలా అనకపోతే తారకమంత్రమూ లేదు, తత్వామృతమూ లేదు.

కోతి ఇలా అనగానే – టక్కుటమారం ఇక అక్కడ ఆగకుండా, నీలికొండల వైపు పరుగు తీసింది.

.... బంగారు ఓర్వగలిగినంత వరకూ ఓర్చాడు. సర్వమంగళం దౌర్జన్యానికి అంతూపొంతూ లేకపోవడంతో –

అతని ఓపిక పూర్తిగా నశించిపోయింది. కోపమంటే ఏమిటో ఎరుగని బంగారు కోపోద్దీపితుడై పోయాడు. తన గోవుల్ని రక్షించుకోవడం తన కర్తవ్యమనుకున్నాడు. అతని నిర్ణయాన్ని విని సెబాసన్నాయి — కుక్కలు.

ఒకనాడు పులి ఒక ఆవును చంపింది. బంగారు తన చేతిలోని గొడ్డలిని బలంకొద్దీ విసిరాడు. పులి ఆ దెబ్బను తప్పించుకొంది. ఆవు శవాన్ని అలాగే వదిలిపెట్టి నీలికొండల లోకి పారిపోయింది.

లేగదూడ — చచ్చి పోయిన తనతల్లి శవం చుట్టూ తిరుగుతూ కన్నీళ్ళు కార్చింది. గుండెలు నీరై పోయేటట్లు 'అంబా' అంటూ రోదించింది. ప్రాణంలేని తల్లి పొదుగును ఆకలితో నాకింది. ఈ దృశ్యం చూచి బంగారు గుండె పుండై పోయింది.

"గోమాతలారా! పులి ఆటలు ఇక ఎన్నో రోజులు కొనసాగవు. దాన్నితరిమేస్తాను. ధైర్యంగా ఉండండి" అన్నాడు ఆవులతో.

పులిని పారద్రోలటం బంగారుకు సాధ్యం కాలేదు. పులి సుంతైనా భయపడటం లేదు. అతడు గొడ్డలి విసరి నప్పటినుంచీ, అది చాలా జాగ్రత్తగా వచ్చి ఆవులను తస్కరిస్తోంది. తన గొడ్డలితో బంగారు దాన్ని ఏమీ చేయ లేక పోయాడు. అదిగూడా బంగారును ఎదుర్కొని అతన్ని చీల్చివేయడానికి తయారుగానే ఉంది.

సర్వమంగళం పీడవదిలించుకోవడం అన్నపానీయాల కంటే ముఖ్యంగా కనిపించింది బంగారుకు. ఎంత చెప్పినా వినని ఆ మొండి జంతువును చంపకుండా తామసించడం ప్రమాదకరం! .... ఎటూ తాను పులిని చంపివేయ దలచుకున్నాడు. అయితే ఆ పని ఎంత త్వరగా జరిగితే అంత మేలు! .... కాని సర్వమంగళం బలవంతమైన జంతువు. దానికి బాకులవంటి కోరలు, ఉలులవంటి గోళ్ళూ ఉన్నాయి. దాని ముందు తాను బలహీనుడు. ఏదైనా మంచి అయుధం సంపాదించ గలిగితే తప్ప — సర్వమంగళాన్ని జయించటం అసాధ్యం!

పట్టణానికి వెళ్ళి తుపాకీ ఒకటి కొని తేవాలనుకున్నాడు బంగారు. తుపాకీతో పులిని బెదిరించవచ్చు. అప్పటికీ అది దాని అలవాటు మానకపోతే—దూరంనుంచే కాల్చి చంపివేయవచ్చు. కనుక తన గోవులను రక్షించ గలిగినది — తుపాకియే!.... .... ....




# 14

ఆకాశవాణికి ఇప్పుడు క్షణమైనా తీరిక ఉండటంలేదు. అరణ్యమంతా తిరుగుతూ – సర్వమంగళం బంగారుల వివాదంగూర్చి ప్రచారాలు చేయసాగింది. బంగారును మిత్ర ద్రోహి అన్నది. సర్వమంగళాన్ని శాంతిదేవత అన్నది.

"బంగారు పరమ దుర్మార్గుడు! రాక్షసుడు! తేనె పూసిన కత్తి! తీపిమాటలతో ఇంతవరకు లోకాన్ని మోసగించాడు. చివరికి – ప్రాణం ఇచ్చే పులిరాజునుగూడా మోసగించ దలచుకున్నాడు."

బంగారు నాటకం — ప్రపంచానికి వెల్లడైపోయింది. వాడు మద్యం త్రాగుతాడు. మాంసం తింటాడు. జూద మాడుతాడు. ఈ కీకారణ్యం మనది. పులిరాజుగారు మకాం పెట్టిన నీలికొండలు మనవికాక మరెవరివి?.... బంగారు అక్రమంగా నీలికొండలలోకి వచ్చాడు. కీకారణ్యంలోకి కూడా జొరబడ్డాడు. నోరులేని జింకల్ని వేటాడి తీసుకపోవడం మొదలుపెట్టాడు. పులి వద్దన్నా అతడు వినలేదు. ఎన్నాళ్ళిలా?.... జింక మాంసం తినమరిగిన బంగారు తన దౌర్జన్యం మానుకోలేదు. ఇక తప్పనిసరిగా పులిరాజు ఈ అధర్మాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. మోసానికి మోసం! దెబ్బకు దెబ్బ! బంగారు జింకల్ని తింటుంటే పులిరాజుగారు గోవుల్ని తీసుకు వస్తున్నారు. ఆ గోవుల్ని వారు స్వప్రయోజనంకోసం ఏమైనా ఉపయోగించుకుంటున్నారా? లేదు!.... దానాల్లో గోదానం ఒకటి. పులిరాజుగారు సాధు పుంగవులకు గోమాంసం దానం చేస్తున్నాడు. ఇంతటి ధర్మాత్ముణ్ణి దొంగ, మోసగాడు అని నిందిస్తున్నాడు బంగారు. గురివెంద గింజకు తన నలుపు ఎలా తెలుస్తుంది? అయినా — పులి రాజుకు రాగల నష్టమేమీ లేదు. ధర్మం అతని పక్షంలో ఉంది. ధర్మానికీ అధర్మానికీ నడుమ చెలరేగుచున్న ఈ సంఘర్షణలో పులిరాజు తప్పక విజయాన్ని సాధిస్తాడు. అతని విజయం మన విజయమే!.... పులిరాజు వర్ధిల్లాలి! బంగారు నశించాలి!...." అంటూ ఆకాశవాణి ఉపన్యాసాలు దంచేస్తోంది. సర్వమంగళం ఈ మాటల్ని ఆకాశవాణిచేత కంఠతా పట్టించి, మరీ ప్రచారానికి పంపింది.

అప్పుడప్పుడు టక్కుటమారంకూడా బంగారును గూర్చి దుష్ప్రచారం చేస్తూ ఉంది.

"సోదరులారా!.... బంగారును నా అన్న అని చెప్పు కోవడానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను. చెడ్డవారితో సోదరత్వంకంటే శత్రుత్వమే మేలుకదా? — అతడు పయోముఖ విషకుంభమని నాకిన్నాళ్ళూ తెలియలేదు. అతని అక్రమాలూ, దౌర్జన్యాలు మితిమీరి పోతున్నాయి. నేను అతని తమ్ముడను కదా?.... నా విషయంలోకూడా నీతి, నిజాయితీలను పాటించక, నన్ను దిక్కులేని అనాథుణ్ణి చేశాడు. అతని గోవులలో నాకు సగభాగం రావాలికాదా?.... అయిదు ఆవుల్ని మాత్రమే నాకిచ్చి, మిగిలిన వాటిని కైవసం చేసుకున్నాడు. న్యాయంగా నాకింకా చాలా గోవులు రావలసి ఉన్నాయి. నేను నోరులేనివాణ్ణి! ఈ అన్యాయాన్ని నేను సహించి ఊరుకున్నానే కాని, అవతార పురుషులైనటువంటి సర్వమంగళంగారు సహించగలరా? వినాశకాలే విపరీతబుద్ధి అంటారు పెద్దలు. వినాశకాలం దాపురించింది గనుకనే బంగారు శాంతిసూత్రావళిని సైతం పటాపంచలుచేసి, హద్దుమీరి ప్రవర్తిస్తున్నాడు. సర్వమంగళంగారు ఆ దుర్మార్గుణ్ణి అణచివేసి, ధర్మాన్ని పునరుద్ధరించగల పండుగ రోజు దగ్గరలోనే ఉంది సర్వమంగళ చక్రవర్తికీ ...." అంటూ శ్రోతల వైపు పరకాయించి చూసింది టక్కుటమారం.

ఒక్క జంతువైనా జేకొట్టలేదు.

టక్కుటమారమే "జై" అని కేకవేసి, రెండోసారి "సర్వమంగళం చక్రవర్తికీ —" అంది. మళ్ళీ తానే "జై" అనుకొంది. ప్రతిసారీ దానికి ఇలాగే జరిగింది.

"గురూ! మాట్లాడుతున్నంతసేపూ — జంతువులు వింటాయిగానీ, తమరిపేరు చెబితేమాత్రం జేకొట్టడం లేదు. వాటిలో ఉత్తేజం కనిపించడంలేదు." అన్నది సర్వమంగళంతో.

"అంతేనత్రా తిండిపోతా? అయితే నీకు పెడుతున్న పిండాకూడు దండగేనన్నమాట!" అన్నది పులి చులకనగా. టక్కుటమారం మనసు చాలా బాధపడింది. సర్వమంగళం తనని ఏహ్యాభావంతో చూడటం ఇదే మొదటిసారి. గురువుగారికి తనపట్ల ఏర్పడిన దురభిప్రాయాన్ని పోగొట్టుకోవడానికి టక్కుటమారం రేయింబవళ్ళు కష్టపడి ప్రచారం చేయసాగింది.

తీరుబడిగా ఉన్నప్పుడెల్లా సర్వమంగళం కారడవికి పోయి, బహిరంగ సభలు జరిపి, బంగారును తూర్పారబట్టి వస్తున్నది..

ఇది యిలా ఉండగా — కోయిలలు, చిలుకలు, పావురాలు జరిగినది జరిగినట్లే చెప్పుకోసాగాయి. చిట్టికోతి ఒక మంచిదళం తయారుచేసి బుర్రకథ చెప్పసాగింది.

వినరా వినరా వీరకుమారా —
విజయము మనదేరా!
తందాన తానా! ........

ఈ విధంగా పులిపాపాలు ఒక్కటొక్కటే పెరిగిపోతున్నాయి. బంగారు వద్దన్నాడు. బ్రతిమాలుకున్నాడు. బెదరించాడు. లాభం లేకపోయింది. మూర్ఖుడి మనస్సు

ఎవరు మార్చగలరు ? చెడిపోయేవాణ్ణి ఎవరు బాగు పర్చ గలరు? బంగారు సహనం కోల్పోయాడు. ప్రళయకాల రుద్రుడే అయినాడు ........"

"ప్రళయకాల రుద్రుడే అయిపోయాడా ? అయితే పులిగాడి పాపం పండిందన్నమాటేగదా అన్నయ్యా ?"

"ఔనోయ్ తమ్మయ్యా ? బంగారుకు కోపంరాదు. వచ్చిందా ఇక తిరుగు లేదు........

పటపటమని పండ్లు గీటెరా — సై
పులిరాజు పాపాలు పండెరా — సై
బంగారన్న తుపాకీ తెచ్చురా — సై
పెనుగుండ్లు ఢామ్మనుచు ప్రేల్చురా — సై
పులి బుడగలా పేలి పోవురా — సై
ప్రాణులంతా సంతసించురా — సై
భళానోయి భాయి తమ్ముడా ........"

బంగారు తుపాకీ తెస్తాడన్న విషయం సర్వమంగళానికి తెలిసింది. మళ్ళీ అది అడవిలోకి వెళ్ళింది." ప్రజలారా ! బంగారు రాక్షసుడు శాంతి సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడన్న సంగతి మీకెల్లరకు విదితమే. అతడు మనల్ని దోచుకోవడమేగాక మనజాతినే నిర్మూలించాలని చూస్తున్నాడు. తుపాకీతో మన అడవిలోనికి రాబోతున్నాడు. ఆరాక్షసుణ్ణి ప్రాణాలతో విడిచిపెట్టడం అవివేకం. అందరూ మూకఉమ్మడిగా అతణ్ణి తుదముట్టించండి. మీ శక్తి సామర్థ్యాలు వాడికి తెలియసట్లుంది. ఏనుగులారా. మీకాళ్ళ సత్తువ

చూపెట్టడానికి ఇది అదను. అడవి పందులారా! .... మీకోరల పదును పరీక్షించు కోవడానికిది చక్కని అవకాశం! .... ముళ్ళ పందులారా! మీముళ్ళ పరాక్రమాన్ని ప్రదర్శించ డానికి ఇది సమయం! మహావీరులారా! యోధాన యోధు లారా! సమరానికి ఆయత్తంకండి! .... విజయలక్ష్మి చేబట్టండి! .... జంతులోకం ...."

"వర్ధిల్లాలి!" అన్నాయి జంతువులు.

"బంగారు ...."

"వర్ధిల్లాలి!"

"జంతులోకం కాదు! బంగారు ...."

"అదే వర్ధిల్లాలి!"

టక్కుటమారం మాత్రం "చావాలి!" అంటు నినాదం చేసింది. తర్వాత అది "సర్వమంగళ చక్రవర్తికీ – అంది. మామూలు ప్రకారం తానొక్కటే "జై!" అన్నది.

జంతువుల గుండెలు వీరావేశంతో నిండిపోలేదనీ అవి తనకు సుముఖంగా లేవనీ సర్వమంగళం గ్రహించింది. "నోర్ముయ్! నిన్నెవరు మాట్లాడమన్నారు?" అంటూ టక్కుటమారాన్ని కసురు కొంది.



## 15

సర్వమంగళం వద్దకు ఒక తాజావార్తను మోసుకు వచ్చింది టక్కుటమారం.

.... బంగారుకు వెంటనే తుపాకీ కావాలి. అయితే తుపాకీ కొనడానికి కావలసిన డబ్బు అతనివద్ద లేదు. తన ఉద్దేశ్యం భార్యకు చెప్పాడు. ఆమె తన ముక్కున ఉన్న బంగారపు బులాకీ తీసి, అతని చేతిలో పెట్టింది. "దీన్ని అమ్మి వేసి తుపాకీ కొనుక్కురా! మన అవులకంటే ఈ బులాకీ

ఎక్కువకాదు." అంది. తన నాలుగు కుక్కల్ని యింటిపద్దే కాపలా ఉంచి, తుపాకీ కోసం పట్టణానికి బయలుదేరాడు బంగారు

గురు శిష్యులకు తుపాకీ అంటే ఏమిటో తెలియక పోయినా — అదేదో బ్రహ్మాస్త్రమనే వూహించాయి అవి. "భయపడతా వెందుకోయ్ పిరికి సన్నాసీ! ఈ సర్వమంగళం శక్తి సామర్థ్యాల్ని అనుమానిస్తున్నావా? చూసుకో నాదెబ్బ! .... ఆవులన్నిటినీ సాగనంపి, చిట్టచివర బంగారు పనిపడదా మనుకున్నాను. కాని, వాడు తొందర పడుతున్నాడు. వాణ్ణి వీలైనంత త్వరగానే పంపించి వేస్తాను" అన్నది సర్వ మంగళం.

ఆ పగలంతా నక్కకు ప్రచారోద్యమంతోనే సరి పోయింది. "సోదరులారా! .... దురాత్ముడైన బంగారు తన గోవుల్ని సంరక్షించుకునే నెపంతో తుపాకీ తెస్తున్నాడు. ఇదంతా నన్ను, సర్వమంగళంగారినీ చంపివేయడానికి వేసిన ఎత్తు. రాజావారితో పోరాడడానికి దమ్ముల్లేక పిరికిపందలా తుపాకీని ఆశ్రయిస్తున్నాడు. నాకు అన్యాయం చేసింది చాలక, గోవులపై నాకున్న హక్కును శాశ్వతంగా కాజేయ డానికి కుట్రపన్నాడు. తుపాకీతో నన్ను చంపివేస్తాడు." అంటూ అది బుడి బుడి ఏడుపులు ఏడ్చింది. "అధర్మం నశిం చాలి! తుపాకీ తుస్సుబోవాలి!" అంటూ కేకలు వేసింది.

పగలు అంతరించింది. పడమటిదిక్కున గ్రుంకుతున్న సూర్యుణ్ణి, పలుదిక్కుల కమ్ముకుంటున్న చీకటిని చూచింది నక్క .... మళ్లీ తెల్లవారుతుంది. తుపాకీతో బంగారు వస్తాడు.

చిట్టికోతి చెప్పినట్లు పులి నీటిబుడగలా పేలిపోతుంది. కుక్కలు తన్ను చీల్చివేస్తాయి. లేదా తుపాకీతో బంగారే చంపివేయ వచ్చు. కనుక, సర్వమంగళంతో తనకు గల సంబంధం ఈనాడితో చెల్లు. ఎవరికి వారే, యమునాతీరే!.... తెల్లవార గానే—తాను ఎక్కడికైనా వెళ్ళి తలదాచుకోవాలి. కాని, తన ఒక్కగా నొక్క కోరిక అలాగే మిగిలిపోయింది. వేదాంతం చాల బాగుంటుందట! పరమాత్మ దివ్యంగా ఉంటుందట! సర్వమంగళం చెప్పింది నిజమెంతో, అబద్ధ మెంతో తనకు తెలియదు. కనుక ఎలాగైనా ఈ పూట తన కోరిక తీర్చుకోవాలి. బంగారు పట్టణానికి వెళ్ళాడు. అవును చంపి తీసుకురావడానికి పులికి యిది మంచి సమయం. ఏదైనా మాయోపాయంతో వేదాంతాన్ని, పరమాత్మను పొంది, తరిం చాలి!—అనుకున్నది నక్క.

అది నేరుగా సర్వమంగళం వద్దకు వెళ్ళింది. ఏనాడూ లేనంత వినయాన్ని ఒలకబోస్తూ నిలబడింది. గ్రుడ్డి వెన్నెలలో అడవి, కొండలూ మసక మసకగా ఉన్నాయి. "దద్దమ్మ! పోతూ పోతూ కుక్కల్ని కాపలా పెట్టి వెళ్ళాడట! గురువుగార్ని చూడగానే అవి పలాయనం చిత్తగించవూ?" అన్నది నక్క.

సర్వమంగళం మాట్లాడలేదు. దాని ముఖం గంభీ రంగా ఉంది. అర్ధరాత్రి కావస్తూ ఉండగా అది చిన్నగా పైకి లేచి నిలబడింది. మెల్లగా అడుగులువేస్తూ కొండ దిగసాగింది. టక్కుటమారంకూడ దాన్ని అనుసరించింది. అవి రెండూ చిట్టడవి చేరుకొన్నాయి. బంగారు యింటివైపుగా పోసాగాయి.

"తుపాకీ తెస్తాడట — తుపాకీ! ....గురూ! తమరు ఒక్కసారి గాండ్రు మనగానే ఆ తుపాకీ తోకముడుచుకుంటుంది. సందేహంలేదు. .... తమరన్నట్టు బంగారుగాడికి రోజులు దగ్గర కొచ్చాయి. వాణ్ణి తమరు యమలోకానికి సాగనంపే ఘట్టం తలుచుకుంటుంటే నాకు భలే నవ్వు వస్తున్నది సుమండీ!" అంటూ కిసుక్కున నవ్వింది నక్క.

సర్వమంగళం మౌనంగా నడుస్తూ ఉంది.

"గురూ! కీకారణ్యమంతా పర్యటించి, నా ప్రచార బలంతో బంగారును ఎందుకూ పనికిరానివాణ్ణి చేసేశాను. ఇప్పుడు జంతువులన్నీ తమర్ని దేవుడంటున్నాయంటే నమ్మండి. తెల్లవారాక చూడండి ముక్తికోసం ఎన్ని జీవాల్ని పట్టుకొస్తానో! .... మొట్టమొదట — ఏనుగును తీసుకురమ్మంటారా?" అని అడిగింది నక్క.

సర్వమంగళం బదులు పలుకలేదు.

"రేపు బంగారు వచ్చి నెత్తీ నోరూ బాదుకోవాలి! .... గురువుగారు యివాళ కనీసం రెండు ఆవుల్ని చంపుతారు. నాకు తెలుసు. రెండు వేదాంతాలు, రెండు పరమాత్మలు! బలే బలే!"

సర్వమంగళం కోపంతో గద్దించింది .... "నోరు మూసుకో — వదరుబోతా! .... "

టక్కు టమారం మరి మాట్లాడలేదు.

అవి బంగారు యింటిని సమీపించాయి. సర్వమంగళం నక్కుతూ, నడయాడుతూ ఆవుల కొట్టం వద్దకు వెళ్లింది. ఒక

ఆవు మీదికి చివుక్కున గెంతి, ఒక్క దెబ్బతో దాన్ని క్రిందికి పడగొట్టింది. ఆవులన్నీ భయంతో రంకెలు వేశాయి. ఆవును ఎత్తుకుని వెళ్లుతున్న పులిని అటకాయించాయి — కుక్కలు. అయితే పులి వాటిమీదికి తిరగబడటంతో అవి తమ ప్రయత్నం మానుకున్నాయి. సర్వమంగళం చచ్చిపోయిన ఆవును మోసుకుని అడవిదారి పట్టింది.

టక్కు టమారం కుక్కల కళ్లబడకుండా తప్పుకోవాలని అటూ యిటూ పరుగెత్తింది. కాని కుక్కలు దాన్ని చూసేయి. అవి కోపంతో టక్కు టమారం మీదికి దూకాయి. టక్కు టమారం కాలి కొద్దీ పరుగెత్తింది. కుక్కలు వెంబడించాయి. మీద పడి కరిచాయి. నక్క కుయ్యో మన్నది. "నన్ను విడిచి పెట్టండి బాబూ! మీ కాళ్లకు మొక్కుతాను" అంది. కుక్కలు వదలిపెట్టలేదు. "ఆవులన్నీ నీవే కదూ? నీకు వాటా కావాలి కదూ?" అంటూ అవి తరిమి తరిమి నక్క ఒళ్లు హూనమయ్యేలా కరచి వదలిపెట్టాయి. నక్క పరుగెత్తి, పరుగెత్తి గాయాలతో నిండిన శరీరంతోను, ప్రాణాలతోను బయటపడింది.

పులికోసం నీలికొండలంతా గాలించింది నక్క. ఎక్కడా పులి కనిపించలేదు. మరునాడు బంగారు తుపాకితో రానున్నాడు గదా! .... అతనికి అందుబాటులో ఉండకూడదని పులి కీకారణ్యంలోకి వెళ్లి ఉంటుంది గాబోలు — అనుకున్నది నక్క. కీకారణ్యానికి బయలుదేరింది.

.... సర్వమంగళం అడవిలో ఉన్న తన పాతగుహాకే వెళ్లింది. తాను చంపి తెచ్చిన ఆవును తినడానికి సిద్ధమౌతుండగా టక్కు టమారం వచ్చింది.

"గురూ! మంచి వార్త తెచ్చాను!" అన్నది.

"ఏమిటి?" అన్నది పులి.

"ఇక్కడికి దగ్గర్లోనే — పెద్ద మర్రిచెట్టు ఉంది చూశారూ?"

"ఔను!"

"అక్కడ కనిపించాడు — "

"ఎవరు? బంగారా?"

"కాదు! ఎవడో బాటసారి? నరమాంసానికీపూట కొరతలేదు."

"ఆఁ! నిజంగానా?" అన్నది పులి సంతోషంతో.

"మీమీద ఒట్టు! కళ్ళారా చూచి వస్తుంటేను!"

"అయితే యిక్కడే ఉండు! నిమిషంలో వచ్చేస్తా" అని పులి బయటకు పరుగుతీసింది.

టక్కుటమారానికి సంతోషంగా ఉన్నా గుండెమాత్రం వేగంగా కొట్టుకోసాగింది. ఆవును సమీపించి, రొమ్ముల్లో చిన్న కంత చేసింది. గుండెకాయను బయటికి లాగి గబగబ తినేసింది. కొంత శ్రమపడితే మెదడునుకూడ తినివేయ వచ్చు. క్షణాలమీద ఆ పని పూర్తిచేసి, సర్వమంగళం తిరిగి వచ్చేలోపల తాను బయటపడాలి.

.... ఇంతలో సర్వమంగళం రానే వచ్చింది. "ఏమి టోయ్ గుంటనక్కా! .... ఎక్కడా కనిపించలేదే?" అంది

వినుగ్గా. టక్కుటమారం గుండె దడదడ లాడిపోయింది. "కన బడలేదా! నేను కళ్ళారా చూశానే! .... గురూ! ఒకవేళ చిట్టికోతి అతన్ని హెచ్చరించిందేమో? .... అతడు పారిపోయి ఉండాలి, లేదా ఏ చెట్టుమీదైనా దాక్కుని ఉండాలి" అంది నక్క.

"ఏడిచావులే!" అంటూ ఆవు దగ్గరికి వచ్చి కూర్చున్నది పులి.

టక్కుటమారం భగవన్నామస్మరణ చేసుకుంటోంది.

"అఁ! ఇదేమి విడ్డూరం! పరమాత్మ కనిపించడం లేదే?" — అన్న మాట విని టక్కుటమారం అదిరిపడింది.

"కనిపించడంలేదా? .... ఏమై ఉంటుంది? .... గురూ! తమరు పైన బడగానే అదిరిపోయి, అక్కడే ఎక్కడో పడిపోయి ఉంటుంది .... ఔనౌను! అంతే జరిగివుంటుంది! ...." అంది.

సర్వమంగళం కళ్లు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి. తరువాత అది శాంతం వహించి, లేచి, గుహద్వారానికి టక్కుటమారానికి మధ్యలో నిలబడింది.

"శిష్యా! పరమాత్మ సందర్శనం లేనిదే ఎన్నడూ ఆహారం ముట్టుకుని ఎరుగనే! ఇప్పు డెలా?" అంది.

"ఎఎఎఎ ఎలా?" అంది నక్క నత్తి నత్తిగా.

కొన్ని రోజులనుండి సర్వమంగళానికి టక్కుటమారం పట్ల అసహనం ప్రబలిపోతున్నది. అందుకు కారణాలు లేక

పోలేదు. ఆహారం సంపాదించటం యిప్పుడు పూర్తిగా తనవంతైతే — యిది తీరా కూర్చుని ముక్కుదాకా మెక్కుతున్నది. దీనివలన తనకు ఏం ప్రయోజనమూ లేదు. ఇక ప్రచారమంటేనా — జంతువులు ఈ దుష్ప్రచారాలను నమ్మే రోజులు గతించిపోయాయి. కనుక ఈ నక్క అవసరం తనకిక పద్దు. ఇవన్నీ ఒక ఎత్తయితే ఈనాడు జరిగిన ద్రోహమే ఒక ఎత్తు! తనను మోసపుచ్చి, పరమాత్మను తనకు లేకుండా చేసింది. ఇది — క్షమించరాని అపరాధం!

"ఎలా అంటే ఎలా శిష్యా? పరమాత్మ లేకపోతే పోయింది. నువ్వే పరమాత్మ అనుకో! నేను జీవాత్మను! జీవాత్మ పరమాత్మలో లీనమైనా, పరమాత్మ జీవాత్మలో లీనమైనా ఒక్కటే! .... ఒకటి, రెండూ, మూడూ అనే లోపున నన్ను నీలో ఐక్యం చేసుకో. లేకపోతే నిన్ను నాలో ఐక్యం చేసుకుంటాను" — అన్నది సర్వమంగళం.

టక్కుటమారం బావురుమన్నది.

"ఒకటీ!"

"నాయనోయ్!"

"రెండూ!"

"దేవుడోయ్!"

"మూడూ!"

"చచ్చా ...."

టక్కుటమారానికి మళ్లీ తెల్లవార లేదు.



## 16

లోకానికి — తెల్లవారింది.

పట్టణం నుంచి బంగారు తిరిగి వస్తున్నాడు. పడవలసిన శ్రమలన్నీ పడి, అతడొక మంచి తుపాకీ సంపాదించుకోగలిగాడు. తుపాకీ స్పర్శ తగులగానే వేయి ఏనుగుల బలం వచ్చినట్లయింది. అతడు ఉత్సాహంతో వడివడిగా వస్తూన్నాడు.

అతడు ఆశ్చర్యపోయేటట్లు — తుపాకీ వేడిగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పు అతని భుజానికి వెచ్చగా తగిలింది.

“తుపాకీ! ఎందుకో విచారంగా ఉన్నావు. కారణం చెప్పవూ?” అని అడిగాడు బంగారు.

"అయ్యో! మనిషి నన్నెందుకు తయారు చేయాలి? .... అతడు నన్ను మంచికీ చెడ్డకు రెండిటికీ ఉపయోగించుకుంటున్నాడు. నాలో కరుణకు తావులేకుండా చేస్తున్నాడు. నన్ను భయంకరంగా ఉండాలని శాసించాడు. అతడు ఆడమన్నట్లా ఆడాలి! అతని చేతిలో నేనొక కీలుబొమ్మను! నాకు స్వేచ్ఛలేదు. వ్యక్తిత్వం లేదు. కాల్చు అంటే కాల్చాలి! చంపు అంటే చంపాలి! ఇది ధర్మం, ఇది అధర్మం అని విచక్షణ చేయకూడదు. ఆ హక్కు నాకు లేదు. ఇప్పుడు నువ్వు నన్ను తీసుకుపోతున్నావు. నేను నీకు బానిసను. నువ్వు ఏం చెబితే అది చేయాలి! ఏ కుందేలును కాల్చమంటావో, ఏ పావురాన్ని పేల్చమంటావో, ఏ జింకను హతమార్చమంటావో — అని బెంగగా ఉంది. మనసు బెంగటిల్లినప్పుడంతా ఒక్క వేడి నిట్టూర్పు వదిలి వూరుకుంటాను. అంతకంటే ఏంచేయగలను?" అన్నది తుపాకి.

బంగారు యిలా అన్నాడు.

"తుపాకీ! నువ్వునాకు బానిసవు కావు. నా నేస్తానివి! నీ స్వేచ్ఛకు నేను అడ్డురాను. అయితే — నీ ద్వారా శుభం చేకూరడమే కదా నీ అభిమతం? .... నీతో నాకున్న అవసరం కూడ అంతవరకే! నీ సహకారంతో అధర్మం నశిస్తుంది. ధర్మం ఉద్ధరింప బడుతుంది. ఈ లక్ష్యానికి సాధనంగా నిన్ను దుష్టమర్దని అని పిలుస్తాను."

దుష్టమర్దని సంతోషించింది.

బంగారు — యింటిని సమీపిస్తుండగా అతని కుక్కలు ఎదురు వచ్చాయి. గతరాత్రి జరిగిన ఘోరాన్నిగూర్చి తెలి

పాయి. బంగారు రక్తం పౌరుషంతో వేడెక్కింది. "పులికి కాలం మూడింది!" అంటూ పిడికిలి బిగించాడు. గబగబ అవులకొట్టం లోకి వెళ్ళాడు. నేలమీద గడ్డకట్టిన రక్తపు మడుగును చూచి దుష్టమర్దని కోపంతో బుసలుకొట్టింది. సర్వ మంగళం దౌర్జన్యాన్ని అమూలాగ్రంగా చెప్పి "దుష్టమర్దనీ! ఇప్పుడేం చేయాలి?" అన్నాడు బంగారు.

"ఏముంది? సర్వమంగళాన్ని లేకుండాచేసి, అధర్మాన్ని లేకుండా చేయాలి! బయలుదేరు!" అన్నది దుష్టమర్దని. బంగారు తుపాకీలో తూటా దట్టించాడు. రక్తపు జాడలు చూచుకుంటూ, పులిని వెదకుతూ ముందుకు సాగాడు. కుక్కలువాసన పసిగడుతూ - ముందుకు ఉరికాయి. అరణ్య మంతా సందడితో, సంబరంతో నిండిపోయింది.

మార్గమధ్యంలో చిట్టికోతి ఎదురు వచ్చింది. తుపాకీ భుజాన ఉంచి బలరాముడిలా వస్తూవున్న బంగారును చూచి, అతి ఆనందంతో మైమరచిపోయింది. "దగ్గరకు వచ్చేసినట్లే! పులి గుహ యికఎంతో దూరంలేదు." అన్నది.

గుహ దగ్గరికి రాగానే కుక్కలు ఆగిపోయి, బిగ్గరగా మొరగసాగాయి. బంగారు తుపాకీ బారుగాపెట్టి నిలబడ్డాడు. చిట్టికోతి గుహ ముందున్న చెట్టుపై కెక్కి కూర్చున్నది. "ఒరేయ్ గురుశిష్యులా! బయటికి రండ్రోయ్! మీకోసం యముడు కబురంపాడు!" అంటూ! కేకవేసింది. పులి లోపలి నుండి గాండ్రుమన్నది.

పులిరాజా! బయటికిరా! నేటితో నీపాపం పండి పోయింది! రా బయటికి!" అంటూ కొండలూ అడవులూ ప్రతి ధ్వనించేటట్లు గర్జించాడు బంగారు.

పులి గాండ్రింపుతో గుహ దద్దరిల్లిపోయింది. పులి బయటికి వచ్చింది. "ఒరే బంగారూ! వచ్చావూ? .... నీ నెత్తురు త్రాగాలని ఎంతో ఉబలాటంగా ఉన్నాను. ఆడ పోయిన తీర్థం ఎదురైనట్లు నీవేవచ్చావు .... ఎంత అదృష్టం!" అంటూ వికటంగా నవ్వుతూ బంగారు మీదికి దూకబోయింది.

దుష్టమర్దని ఢామ్మంటూ ప్రేలింది.

పులి నాలుగుపల్టీలు కొట్టింది. తుపాకి గుండు దాని ముంగాలి జబ్బలో దూసుకుపోయింది. చిట్టికోతి "దుష్టమర్ద నికి జై!" అంది. బంగారు మళ్ళీ తుపాకీ పైకెత్తాడు. పులి కదిలించ కుండా ముంగాళ్ళు జోడించి నమస్కరించింది. "బంగారూ! శరణు శరణు! నన్ను క్షమించు! నాకు ప్రాణ భిక్ష పెట్టు! నీ కాళ్ళకు మ్రొక్కి వేడుకుంటున్నాను. కరు ణించు!" అంటూ అతి దీనంగా బ్రతిమాలుకొంది.

"చంపు! కాల్చు!" అంది చిట్టికోతి.

"దాని మాయ మాటలు నమ్మకు! చంపేయ్!" అన్నాయి కుక్కలు.

"క్షమించాలి! క్షమించాలి!" అంది పులి.

బంగారుమళ్ళీ కాల్చలేకపోయాడు .... పులి క్షమాభిక్ష అడుగుకొంటున్నది. శరణు అన్నవాడిని వధించటం ధర్మం కాదు.

"సర్వమంగళం! నీవు కోరినట్లే నిన్ను క్షమి
వదలి పెడుతున్నాను. అయితే నా షరతులకు అంగీకరిం

"అవశ్యం !"

నీ దౌర్జన్యం మానుకోవాలి! నా గోవులను మళ్లీ
హరించరాదు! సరేనా ?"

పరమాత్ముని సాక్షిగా!"

"అయితే యిక వెళ్లు! ఈ కట్టడి తప్పితే, ఈసారి
క్షమించేది లేదు.

సర్వమంగళం బ్రతుకు జీవుడా అని — రుంటుత
రుంటుతూ పరుగుతీసింది.

కుక్కలు గుహలోపలికి జొరబడ్డాయి. బంగారు పులి
వదిలిపెడితే వదిలిపెట్టాడు, తాము టక్కుటమారాన్ని వదలి
పెట్టరాద దనుకున్నాయి అవి. దాన్ని చీలికలు పేలికలుగా
చీల్చిపారెయ్యా లనుకున్నాయి. అయితే — వాటికి గు
టక్కుటమారం సజీవంగా కనిపించలేదు. కుక్కలు చేయా
లనుకొన్న పనిని పులి ఎప్పుడో చేసిపెట్టేసింది.

"టక్కుటమారాన్ని దేవుడే శిక్షించేశాడ్రోయ్!
అనుకున్నాయి అవి.

